# ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ.శ్రీ.శ్రీ. ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org





# ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?


<u>రచయిత:</u> **త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-39 ద్వితీయ ముద్రణ : డిసెంబర్-2017

ప్రతులు : 1000 **వెల : 50 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) మానవత్వము.
95) సుప్రసిద్ధి బోధ.
96) రూపము మారిన గీత.
97) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
98) రాజకీయము×రాజకీయము.
99) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. బ్రహ్మవిద్య
131. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి.శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

## ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**యస్. అనిల్‌కుమార్**

కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా

Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**

మామిడి కుదురు (మం),

తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,

84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)

బొద్దాం (గ్రా), రాజాం (మం),

శ్రీకాకుళం (జిల్లా).

Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**

చెల్లారపు వలస (గ్రా),

బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.

Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**

మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),

రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)

09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)

నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.

Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)

చెన్నై, తమిళనాడు రాష్ట్రం.

Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)

కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)

మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.

Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**

కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).

Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)

జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**

పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.

Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)

అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)

Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.

Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**

భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.

Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**

గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.

Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**

శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్

పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,

బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.

Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**

San Antonio, TEXAS, U.S.A

+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**

Atlanta, GEORGIA, U.S.A

+1(404) 551 3297, +1(470) 658 7635

# ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?

ఒకవైపు ముస్లీమ్‌లు మరొకవైపు క్రైస్తవులు ఏసు మరణమును గురించి గత కొన్ని సంవత్సరములుగా వాదోపవాదములు జరిపారు, జరుపుతూనే యున్నారు. నేటికీ ఆ సమస్య ఒక గట్టుకు చేరలేదు. వాస్తవముగా ఏసును క్రైస్తవ బోధలు చెప్పిన ఒక ప్రవక్తయని ఒక విధముగా చెప్పవచ్చును. క్రైస్తవులు తమ ప్రవక్తగా చెప్పుకొను ఏసును ముస్లీమ్ సోదరులు బైబిలులోని వాక్యములను ఆధారము చేసుకొని 'ఏసు శిలువ మీద చనిపోలేదు' అని చెప్పుచుండగా, క్రైస్తవులు మాత్రము అదే బైబిలులోని వాక్యములను చూపిస్తూ 'ఏసు శిలువ మీదనే చనిపోయాడని' చెప్పుచున్నారు. ఒకే బైబిలు గ్రంథమునుండి ఒక వైపు ముస్లీమ్‌లు, మరొక వైపు క్రైస్తవులు తమ వాదనలను చెప్పుచున్నారు. గత కొంత కాలముగా రెండు మతముల వారి వాదనలను వినిన మేము మాకు తెలియబడిన విధానమును గురించి బయటకు చెప్పదలచుకొన్నాము. నేను హిందూ సమాజములో పుట్టిన వానిని, నేను ఏసు మరణమును గురించి మాట్లాడితే మొత్తము మూడు మతములవారు ఆ విషయమును గురించి మాట్లాడినట్లగును. క్రైస్తవులు చెప్పు మాటలకు, ముస్లీమ్‌లు చెప్పు మాటలకు ఎంతో వ్యత్యాసము కలదు. అలాగే ఇప్పుడు మేము చెప్పు మాటలు కూడా వారి ఇరువురి వాదనలకు భిన్నముగా ఉండుటనుబట్టి ఏసు మరణమును గురించి మూడు మతముల వారికి మూడు రకముల ఉద్దేశ్యములున్నట్లు బయటి ప్రజలకు తెలియు చున్నది.

క్రైస్థవులు, ముస్లీమ్‌లు తమ వాదనలను 'యుట్యూబ్'లో (ఇంటర్ నెట్‌లో) ఉంచారు. కావున వారి వాదనలను 'యుట్యూబ్' వెబ్‌సైట్‌లో మీరు చూడవచ్చును. ఇక్కడ మా వాదనను మేము గ్రంథరూపములో వ్రాయుచున్నాము. మా వాదన శాస్త్రబద్ధముగా, హేతుబద్ధముగా ఉండవలెనని మధ్యాత్మను కోరుకొనుచున్నాను. **క్షర, అక్షర, పురుషోత్తమ** అను మూడు ఆత్మలలో మధ్యాత్మ సహకారము వలన తెలుపబడు

విషయములన్నియూ అందరికీ అర్థమగులాగున ఉండవలెనని తలచు చున్నాము. నేను ఒక మతమునకు గురువును కాను. మూడు మతములకు సంబంధించిన పరిమిత విషయములకు మాత్రము గురువుగా చెప్పబడు చున్నాను. అందువలన క్రైస్తవులకు సంబంధించిన విషయమును కూడా నేను చెప్పవలసి వచ్చినది.

ఏసు జీవితమును మూడు భాగములుగా విభజించవచ్చును. ఒక భాగములో ముప్పై (30) సంవత్సరముల బాల్య జీవితము ఉండును. మరియొక భాగములో మూడు (3) సంవత్సరముల జీవితము అందరికీ తెలిసిన జీవితముండును. మూడవ భాగములో ముప్పై మూడు సంవత్సరముల తర్వాత జీవితము, ఎవరికీ తెలియని ఏసు జీవితము ఉండును. 30 సంవత్సరములు ఒక భాగము కాగా, 3 సంవత్సరములు రెండవ భాగము కాగా, 33 సంవత్సరముల తర్వాత గడచిన జీవితము మూడవ భాగముగా యున్నది. ఏసు జీవితములో రెండు భాగములు మాత్రము అందరికీ తెలుసు. అయితే ఏసు మూడవ భాగము యొక్క జీవితము ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ఇటు క్రైస్తవులకుగానీ, అటు ముస్లీమ్‌లకు గానీ, మిగతా హిందువులకు గానీ తెలియని మూడవ భాగ జీవితము ఇక్కడ పొందుపరుచబడుచున్నది. ఏసు మూడవ భాగ జీవితము చరిత్ర ఆధారము లేనిదని కొందరు కొట్టివేయవచ్చును. వారు ఏసు మూడవ భాగ జీవితమును ఒప్పుకోకపోవుటకు అందరికీ అధికారమున్నా, నేను మాత్రము ఒప్పించుటకు కాకపోయినా, కేవలము తెలియబరచుటకే **మధ్యాత్మ** అందించిన సత్యమును తెలుపుచున్నాను.

ఏసు మూడవ భాగ జీవితమును గురించి తెలిసినవాడు ఏసు ఒక్కడు మాత్రమే. ఆయన మినహా ఇతర మనుషులకు ఎవ్వరికీ ఏసు మూడవ భాగ జీవితమును గురించి తెలియదు. ఆయన చివరి జీవితము

ఆయన చెప్పితే తప్ప ఇతరులు ఎవరూ చెప్పుటకు వీలు లేదు. అయితే ఇక్కడ ఒక్క అవకాశము కలదని మీకు ప్రత్యేకముగా తెలుపుచున్నాను. అదేమనగా! ఏసు ఒక శరీరమును ధరించి పుట్టిన మనిషేయని చెప్ప వచ్చును. ఏసు శరీరములో ప్రకృతి సిద్ధముగా అన్ని అవయవములు ఉండడమే కాక ఆయన శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనబడు మూడు ఆత్మలుండును. ఇది ప్రతి శరీరములోనూ ఉన్న సత్యమే. జీవాత్మ ప్రతి శరీరములోనూ వేరువేరుగా ఉండగా, ఆత్మ పరమాత్మ అన్ని శరీరముల లోను ఒక్కటిగానే ఉండును. ప్రపంచమునకంతటికీ ఒకే పరమాత్మ, ఒకే ఆత్మ ఉండును. అయితే పరమాత్మ రూప, నామ, క్రియలు లేనివాడు అయినందున దేవుడు లేక అల్లాహ్ అనబడు పరమాత్మ మాట్లాడడు, పనిని చేయడు. మధ్యలోనున్న ఆత్మ మాత్రమే అన్ని పనులు చేయుచు, అన్నిటికీ కారణమై ఉన్నది. జీవాత్మ ఏ బలము లేనివాడై, ఏ అవయవము లేనివాడై ఉండుట వలన జీవుడు ఏమీ చేయలేనివాడై యున్నాడు. మధ్యాత్మ మాత్రము శరీరములో జరుగు విషయములను తానే స్వయముగా తెలుపగలదు. శరీరములో అన్ని పనులను తానే చేయగలదు. నేను మధ్యాత్మను ప్రాధేయపడగా ఆత్మ నాకు తెలిపిన విషయములను ఇక్కడ మీకు తెలుపుచున్నాను.

**ప్రశ్న :- మీరు ఏమి చెప్పినా మిమ్ములను ప్రశ్నించుటకు నేను సిద్ధముగా యుందును. నా ప్రశ్నకు జవాబు చెప్పి ముందుకు పోవలసినదిగా చెప్పు చున్నాను. ఆత్మ అందరికీ యున్నప్పుడు ఎవరికీ చెప్పని ఆత్మ, ఎవరితోనూ మాట్లాడని ఆత్మ, నీ ఒక్కనితో మాత్రము మాట్లాడడమేమిటి? సృష్ట్యాదినుండి ఎవరూ 'ఆత్మ నాతో మాట్లాడింది' అని చెప్పలేదు. అటువంటిది నీతో మాట్లాడినదంటే మేము నమ్మాలా? నీతో ఆత్మ మాట్లాడినదనుటకు ఆధారమేమి కలదు? చెప్పగలరా?**

**జవాబు :-** గత చరిత్రలో ఆత్మ మాట్లాడిన సందర్భములు గలవు, అయితే వారికి ఆత్మ తమతో మాట్లాడినట్లు గుర్తించలేకపోయారు. అందువలన ఆత్మ మాట్లాడిన విషయమును ఎవరూ చెప్పలేకపోయారు. వారికి వారి శరీరములో ఆత్మ యొకటి ఉందను విషయము కూడా తెలియదు. ఆత్మను గురించిన జ్ఞానము మూడు దైవగ్రంథములలోనూ చెప్పబడినది. అయినా అది ఆత్మకు సంబంధించిన జ్ఞానమని మూడు మతముల వారు గ్రహించ లేకపోయారు. అందువలన ఆత్మ ప్రస్థావన ఇంతవరకు ఎక్కడా రాలేదు. ఆత్మ విషయ జ్ఞానము మాతోనే బహిర్గతమవుచున్నది. అందువలన ముందు జరిగినదే తర్వాత ఆధారము కాగలదు. ఇప్పుడు మేము చెప్పినది తర్వాత కాలములో ఆధారమగును గానీ, ఇప్పుడు మేము చెప్పిన దానికి ముందు జరిగిన ఆధారము ఏమీ లేదు.

మూడు ఆత్మలు అందరిలోయున్నా తాము ఏ ఆత్మ అయినది, ఏ ఆత్మ మాట్లాడగలదు, ఏ ఆత్మ మాట్లాడదు అను విషయము ఎవరికీ తెలియదు. నేడు సంపూర్ణ జ్ఞానులమని అనుకొనువారు కూడా మూడు ఆత్మల విషయమును తెలియకపోవడము వలన మధ్యాత్మ విషయము పూర్తిగా తెలియకుండా పోయినది. మధ్యాత్మ ఒకటున్నదను జ్ఞానమే తెలియ కుండా పోయినది. అటువంటి సందర్భములో మేము మధ్యాత్మ మాట్లాడింది అని అంటే 'అదెలా?' అని అడుగగలరు. ఇతరులకు తెలిసినా తెలియక పోయినా అందరితో మధ్యాత్మ మాట్లాడుచున్నది. అడిగిన వారికి ఎంత జ్ఞానమునయినా చెప్పగలదు. నాకు మధ్యాత్మ ఫలానాయని తెలిసి నా సంశయమును అడిగాను. దానికి ఆత్మ చెప్పిన జవాబునే వ్రాయగలుగు చున్నాను. **ఎంతటి రహస్యమునయినా ఆత్మ తప్ప ఎవరూ చెప్పలేరు.**

నేడు ప్రపంచములో ఏసు మరణము ముస్లీమ్ మరియు క్రైస్థవుల మధ్య వాదోపవాదములుగా మారిన విషయము అందరికీ తెలుసు. వారిరువురకూ తెలియని రహస్యమును నేను ఆత్మ ద్వారా తెలియగలిగాను. వారి వాదనలకు కొంత భిన్నముగా యున్నా మా వాదన కూడా వినమని కోరుచున్నాను. ఏసు ఒక మత ప్రవక్తగా చెప్పబడినా, ఆయన మత ప్రవక్త కాదు. ఆయన దృష్ఠిలో మతమనునదే లేదు. ఏసు ప్రతి మనిషికి అవసరమైన జ్ఞానమును చెప్పాడు గానీ, ప్రత్యేకించి ఒక మతమును గురించి చెప్పలేదు. ఆయన జీవితము మూడు భాగములుగా యున్నా, దానిని తెలియలేని మనుషులు ఆయన జ్ఞానము గ్రంథరూపములో కూడా మూడు భాగములుగా యున్నదని తెలియలేకపోయారు. పరిశుద్ధ బైబిలు గ్రంథములో ఏసు చెప్పిన జ్ఞానము కలదని చెప్పు క్రైస్తవులు బైబిలు గ్రంథములోని బోధలు పాత, క్రొత్త నిబంధనలు అను రెండు భాగములు మాత్రము చెప్పుచున్నారు. అయితే సువార్తలను మూడవ భాగముగా ఆ గ్రంథమును ఎవరూ విభజించి చూడలేదు. ఏసు జీవితమును మూడు భాగములుగా విభజించి చూడలేని మనుషులు, అలాగే బైబిలు గ్రంథమును కూడా మూడు భాగములుగా విభజించి చూడలేకపోయారనుట సత్యము.

బైబిలు గ్రంథము పూర్తి అరవై ఆరు (66) పాఠములుగా యున్న విషయము అందరికీ తెలుసు. అందులో 39 పాఠములు పాత నిబంధన గ్రంథముగా చెప్పబడుచుండగా, 27 పాఠములు క్రొత్త నిబంధన గ్రంథముగా చెప్పబడుచున్నవి. ఈ విధముగా బైబిలు గ్రంథము పాత, క్రొత్త అను రెండు విధములుగా విభజించి చెప్పబడుచున్నది. అయితే ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! క్రొత్త నిబంధనలో గల 27 పాఠములలో మొదటి నాలుగు పాఠములు **'సువార్త'** అను ప్రత్యేకమైన పేరు కలిగియుండి అవి ఏసు జీవితములో మాత్రము చెప్పబడిన జ్ఞానమును

బోధించుచున్నవి. అందువలన క్రొత్త నిబంధనలోని 27 పాఠములలో నాలుగు పాఠములను ప్రత్యేకముగా విభజించవలసి వచ్చినది. ఈ నాలుగూ **"సువార్తలు"** అను ప్రత్యేకమయిన పేరు గలిగియున్నవి. సువార్తలను నాలుగు పాఠములలో ఏసు స్వయముగా మాట్లాడి చెప్పిన బోధలు మాత్రమే యున్నవి. మిగతా 23 పాఠములుగానీ, పాత నిబంధనలోని 39 పాఠములు గానీ మొత్తము 62 పాఠములకు సువార్తలను పేరు లేదని గ్రహించవలెను. 62 బైబిలు పాఠములలో దేవుని జ్ఞానమేయున్నా అది మనుషుల చేతగానీ, దేవదూతల చేతగానీ చెప్పబడిన జ్ఞానముగాయున్నది. కేవలము నాలుగు సువార్త పాఠములలో మాత్రమే స్వయముగా ఏసు చెప్పిన మాటలు గలవు. ఏసు సాధారణ మనిషివలె కనిపించినా ఆయన సాధారణ వ్యక్తి కాదు. ఆయన ప్రత్యేకమయిన మనిషిగాయుండుట వలన, ఆయన చెప్పిన బోధలుగా యున్న నాలుగు పాఠములకు నాలుగు సువార్తలని చెప్పడమయినది. నాలుగు సువార్తలు ప్రత్యేకముగా యుండుట వలన ఆ నాలుగు సువార్తలలో యున్న జ్ఞానము ప్రత్యేకమయినదని చెప్పకనే తెలియుచున్నది.

బైబిలు గ్రంథమును బాగా గ్రహించితే అందులో పాత నిబంధనగా 39 పాఠములుండగా, క్రొత్త నిబంధన 27 పాఠములుగా యున్నది. క్రొత్త నిబంధన మొదటిలోనే నాలుగు సువార్తలు ఉండుట వలన అది ప్రత్యేక మైనవిగా చెప్పబడుచున్నవి. 39 పాత నిబంధన పాఠముల తర్వాత 40,41,42,43 వరుసగా నాలుగు సువార్తలు గలవు. పాత నిబంధన తర్వాత నాలుగు సువార్తలను ఒక భాగముగా గుర్తించగలిగితే క్రొత్త నిబంధనలోని మిగతా 23 పాఠములు మూడవ భాగముగా గుర్తించబడును. బైబిలు గ్రంథము సహజముగానే రెండు భాగములుగా ఉండగా దానిలో గుర్తించగలిగితే మూడవ భాగము కూడా యున్నది. అదే విధముగానే ఏసు జీవితము సహజముగా రెండు భాగములుగా కనిపించుచున్నది.

అయితే ఆయన జీవితమును బాగా పరిశీలించగలిగితే మూడు భాగములుగా కనిపించుచున్నది.

పుట్టినప్పటినుండి ఆయనకు 30 ఏళ్ళ వయస్సు వచ్చువరకు ఒక జీవిత భాగముగా, తర్వాత మూడు సంవత్సరముల జీవితమును మరియొక భాగముగా, ఆ మూడు సంవత్సరముల జీవితము తర్వాత గడచిన జీవితమును మూడవ జీవిత భాగముగా చెప్పవచ్చును. అయితే మూడవ జీవిత భాగము ఏసుకు లేదని అందరూ అనుకోవడము జరుగుచున్నది. ఇప్పుడు మేము మాత్రము మూడవ జీవితమును గురించి చెప్పినా ఎవరూ నమ్మేస్థితిలో లేరని మాకు బాగా తెలుసు. అయినా అది సత్యము కనుక ఇతరుల నమ్మకము మీద ఆధారపడక, మాకు తెలిసిన సత్యమును తెలుపు చున్నాము. ఏసు పుట్టినప్పటినుండి 30 సంవత్సరములు గడచువరకు ఏమాత్రము జ్ఞాన బోధలు చెప్పకుండా, తాను జ్ఞానిని అని బయటకు తెలియకుండా బ్రతికాడు. తల్లి తండ్రి వద్ద, అన్నదమ్ముల వద్ద 30 సంవత్సరముల వయస్సు వచ్చువరకు బ్రతికిన జీవితమును ఆయన మొదటి జీవిత భాగమని చెప్పవచ్చును. ఆ జీవితములో సాధారణ మనిషివలె ఏసు జీవించడము జరిగినది. ఆయన మొదటి జీవితములో ఆయన ప్రజలకు ఎవరికీ తెలియబడలేదు. 30 సంవత్సరములు సాధారణ జీవితము గడిపిన ఏసు ఎప్పుడూ తన మొదటి భాగ జీవితములో దైవజ్ఞానమును గురించి చెప్పలేదు.

ఏసు తన మొదటి జీవితము 30 సంవత్సరములు గడచిన తర్వాత మొదలు పెట్టిన మూడు సంవత్సరముల జీవితములో ప్రజల మధ్యలోనికి పోయి తన జ్ఞానమును తెలియజేశాడు. ప్రజలలో ఆయన మహోన్నత వ్యక్తిగా నేడు పేరు పొందినా, ఆనాడు మూడు సంవత్సరములలో దుర్భర జీవితమును గడిపాడనియే చెప్పవచ్చును. తన మొదటి 30 సంవత్సరముల

జీవితముకంటే మూడు సంవత్సరములు కష్టజీవితమును గడిపాడు. తనదంటూ ఏదీ లేకుండా, మార్చుకొనుటకు రెండవ అంగీ కూడా లేకుండా ఆయన తన జీవితమును గడిపాడు. అయినా ఆ మూడు సంవత్సరములు తన జ్ఞానమును ప్రజలకు బోధించాడు. ఆనాడు ఆయన (ఏసు) పన్నెండు మంది శిష్యులను ఏర్పరచుకొనినా, చివరకు ఆయన వద్ద మిగిలినది పదకొండు మంది శిష్యులు మాత్రమే. ఏసు మూడు సంవత్సరములలో చెప్పిన బోధలను ఆయన అక్కడ లేకుండా పోయిన తర్వాత నలుగురు వ్యక్తులు ఏసు బోధలను గ్రంథరూపముగా వ్రాయడము జరిగినది. అలా వ్రాసినవే నాలుగు సువార్తలను పేరుతో మనముందు గలవు. ఆయన జ్ఞాన బోధలు చెప్పునప్పుడు సమీపములోయున్న ఆయన శిష్యులలో నలుగురు వారు విన్న దానిని, చూచిన దానిని వ్రాశారని మనము అనుకోవచ్చును. ఎలాగయితేనేమి ఆయన బోధలు నాలుగు సువార్తల రూపముగా మనకు అందినందుకు సంతోషించాలి.

ఏసు అపరిచితునిగా గడపిన 30 సంవత్సరములు, తర్వాత సుపరిచితునిగా గడపిన మూడు సంవత్సరములు మొత్తము 33 సంవత్సరములు గడచిన తర్వాత ఏసు జీవితములో ఒక సంఘటన జరిగినది. ఆయన శత్రువులు ఆయనను చంపాలనుకొన్నారు. అందులోని భాగముగానే ఆయనకు పిలాత్ రాజువద్ద మరణ శిక్ష ఖరారు చేయబడుతుంది. శిలువ మీద వ్రేలాడదీసి చంపునట్లు తీర్పు చేయ బడుతుంది. ఆ విధముగానే ఏసును శిలువ ఎక్కించడము, ఆయన మరణించగా మృత దేహమును అప్పటి ఆయన భక్తులు సమాధి చేయడము జరిగినది. శుక్రవారము ఆయన శిలువ మీద చనిపోగా ఆ దిన సాయం కాలము ఆయనను సమాధి చేయడము జరుగగా, ఆదివారము తెల్లవారక ముందే తిరిగి ఆయన సజీవముగా సమాధి నుండి బయటికి వచ్చి తన శిష్యులకు కనిపించడము జరిగినది. ఆ దినము ప్రత్యక్ష సాక్షులుగా చూచిన

వారికి అది జరిగినదంతా సత్యమే. అందువలన నేడు ప్రపంచములో అత్యధికముగా యున్న క్రైస్తవులు అందరూ ముక్తకంఠముతో ఏసు చావును జయించి తిరిగి సజీవునిగా వచ్చిన దేవుడని చెప్పడము జరుగుచున్నది. ఈ మాట ఎక్కువగా ప్రజలను ఆకర్షించులాగ యుండుట వలన క్రైస్తవ మతము తర్వాత రెండవ స్థానములో యున్న ముస్లీమ్ మతమువారు దానిని అసత్యమని వాదించసాగారు. అలా వాదించడములో వారి ముఖ్య ఉద్దేశ్యము అల్లాహ్ తప్ప ప్రపంచములో ఇతర దేవుడు లేడని, ఉన్నది ఒకే దేవుడని, ఆయనే 'అల్లాహ్' అని వారి ప్రగాఢ విశ్వాసము.

'దేవుడు' అను విషయములో ఇతర దేవున్ని ఒప్పుకోకపోవడము ముస్లీమ్‌లది మంచి లక్షణమే అగుట వలన వారి వాదనలో 'ఏసు చనిపోలేదనీ, తిరిగి సజీవముగా లేవలేదనీ' చెప్పడము వారి వంతు అయినది. ఏసు శిలువ మీద చనిపోయాడను మాట అక్షర సత్యమని క్రైస్తవ బోధకులు చెప్పుచుండగా, ఏసు మొదటికే చనిపోలేదని ముస్లీమ్ బోధకులు చెప్పడము జరుగుచున్నది. వారివారి వాదనలలో వారివారి దేవుడే గొప్పయని చెప్పుకోవడము ప్రధానాంశముగా యుండుట వలన అదే ఉద్దేశ్యముతో వారు వారి వాదనలను చెప్పుచున్నారు. ప్రపంచమునకంతటికీ దేవుడు ఒక్కడేయను మాట సరియైనదేనని నేను కూడా చెప్పుచున్నాను. అయితే ఆనాడు క్రైస్తవులు శిలువ మీద ఏసు చనిపోయినది చూచిన మాట వాస్తవమేయని ఒక ప్రక్క చెప్పుచూనే, దేవుడు ఒక్కడేయనుటను గురించి ముస్లీమ్‌లు వాదించు వాదన కూడా సరియైనదేయని చెప్పుచున్నాను.

**ప్రశ్న :- మీరు చెప్పు మాటలను చూస్తే ఇటు క్రైస్తవులను, అటు ముస్లీమ్‌లను సందిగ్దములో పడవేయుచున్నారు. క్రైస్తవులు చెప్పుమాటను మీరు సత్యమే అన్నప్పుడు, వారు చూచినది సత్యమే అన్నప్పుడు, నేను మిమ్ములను సూటిగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. మీరు సూటిగానే సమాధానము**

**చెప్పండి. ఒకమారు చనిపోయిన వ్యక్తి ఎవరైనా తిరిగి అదే శరీరములో బ్రతుకుటకు అవకాశము కలదా? మీరు మీ జ్ఞాన బోధలలో ఒకమారు శరీరమును వదలిన తర్వాత, పూర్తిగా మరణమును పొందిన తర్వాత, అతను (ఆ జీవుడు) ఆ శరీరములో ప్రవేశించుటకు వీలులేదని చెప్పారు. మీ మాట ప్రకారము ఏసు బ్రతికాడనుట సత్యమగునా?**

**జవాబు :-** ధర్మము సృష్ట్యాదిలో ఏది చెప్పబడినదో అదే ధర్మము ఎప్పటికీ ఉండును. దేవుడు మారడు, ధర్మము మారదు. కాలానుగుణముగా గానీ, పరిస్థితులనుబట్టిగానీ మారునది ధర్మము కాదు. ఒక్కొక్క దేశములో ఒక్కొక్క న్యాయము, ఒక్కొక్క నీతి ఉండునుగానీ, ధర్మము మాత్రము భూమండలము నకంతటికీ ఒకటే ఉండును. ఒక క్రియ ఒక దేశములో న్యాయ సమ్మతమైతే, అదే క్రియ మరొక దేశములో న్యాయ సమ్మతముకానిదై, శిక్షార్హమై ఉండును. దేవుని ధర్మములలో అటువంటిది ఏదీ లేదు. ధర్మము ఎక్కడయినా ధర్మమే, అధర్మము ఎక్కడయినా అధర్మమే. ఇదే సిద్ధాంతమును అనుసరించి మేము చెప్పిన జ్ఞానమంతయూ గలదు. 'ఒకమారు మరణించి శరీరమును వదలిన జీవుడు తిరిగి ఆ శరీరమును చేరుటకు వీలులేదు అనునది ధర్మ సమ్మతమైనమాట. ఇంకా చెప్పవలెనంటే శాస్త్రసమ్మతమైనమాట కూడా అగును. ఒకవేళ ఎక్కడయినా చనిపోయిన శరీరములోనికి తిరిగి అదే జీవుడు చేరాడు అంటే అది అధర్మమగును మరియు అశాస్త్రమగును. నీవు ప్రశ్న నన్ను అడిగావు అయితే నీ ప్రశ్నలో లోపముంది, నా జవాబులో లోపము లేదు.

ఏసును శిలువ మీద చనిపోయినట్లు ఆ రోజు ఆయన భక్తులందరూ చూచారు. అదే విషయమునే నేడు క్రైస్థవులందరూ చెప్పుచున్నారు. తిరిగి ఆయన (ఏసు) బ్రతికి లేచాడని చెప్పుచున్నారు. వారు చెప్పే మాటలో సత్యముందా, అసత్యముందా అని ఆలోచిస్తే వారికి తెలిసినంతవరకు వారు

చెప్పేది సత్యమే. అయితే వారికి తెలియని అసత్యము అక్కడ దాగియుందని క్రైస్థవులకు తెలియదు. ఏసు చనిపోయాడని వారు చెప్పుమాట కొంతవరకు అనగా వారికి తెలిసినంతవరకు సత్యమే. వారికి తెలియని అసత్యము కూడా అందులోయున్నది. అక్కడ ఆ దినము జరిగిన సత్యము ఏమంటే ఏసు పైకి చనిపోయినట్లు కనిపించినా ఏసు నిజముగా చనిపోలేదు. చనిపోని వాడు తిరిగి లేవడము ఎక్కడయినా జరిగే పనియేయని మనము తెలియవలెను. ఏసు తన విషయములో మనుషులు పొరపడుటకు అవకాశముండుట వలన, తన జీవితములో ఒకటి రెండుచోట్ల చనిపోయా రనుకొనిన వారిని, అందరూ చనిపోయారని నమ్మి శవములనుకొనిన వారిని తిరిగి సజీవముగా లేపాడు. ఇదంతయూ బైబిలు గ్రంథములో అక్కడక్కడ గలవు.

**(లూకా, 8-51, 56) అందరును ఆమె నిమిత్తమై ఏడ్చుచూ రొమ్ము కొట్టుకొనుచుండగా ఆయన (ఏసు) వారితో "ఏడ్వవద్దు, ఆమె నిద్రించు చున్నదేగానీ చనిపోలేదని చెప్పెను. ఆమె చనిపోయెనని వారెరిగి వారాయనను అపహసించిరి. అయితే ఆయన ఆమె చెయ్యి పట్టుకొని చిన్నదానా లెమ్మని చెప్పగా, ఆమె ప్రాణము తిరిగి వచ్చెను. కనుక వెంటనే ఆమె లేచెను. అప్పడాయన ఆమెకు భోజనము పెట్టుమని ఆజ్ఞాపించెను."**

ఇటువంటిదే మరియొక చోట గలదు. చనిపోయాడని అనుకొన్న మనిషిని, సమాధిలో పెట్టిన మనిషిని ఏసు తిరిగి సజీవముగా లేపాడు. అక్కడ కూడా ఆయన చనిపోలేదని నిద్రించుచున్నాడని చెప్పడమైనది. ఈ సంఘటనలను బాగా విశ్లేషించి చూస్తే ఇందులో మనకు తెలియని కొన్ని రహస్యములు తెలియగలవు. ఎవరినయితే చనిపోయారని అనుకొన్నారో ఆ బాలికను, లాజర్ అను వ్యక్తిని చనిపోలేదని ఏసు చెప్పాడు. కావున చావు విషయములో మనము అనేక సందర్భములలో పొరపడుచున్నామని

అర్థమగుచున్నది. చనిపోకున్నా మనకు తెలిసిన దానినిబట్టి చనిపోయాడని అనుకొంటున్నాము. ఏసు బాలిక విషయములో ఆమె చనిపోలేదు అంటే ఆయనను అపహాస్యము చేశారని కూడా వ్రాశారు కదా! ఇప్పుడు శిలువ వేసిన దినము ఏసు నిజముగా చనిపోలేదు అంటే మీరు కూడా నన్ను అపహాస్యము చేయగలరు.

ఏసు చనిపోయివుంటే ధర్మము ప్రకారము ఆయన తిరిగి లేచుటకు వీలు లేదు. ఆయన చనిపోలేదు కావున ఆయన తిరిగి లేచాడు. బాలిక చనిపోయిందని బాలికను చూచిన వారందరూ అనుకొన్నట్లు, ఆ దినము ఏసును చూచిన వారందరు ఆయన చనిపోయాడని పొరపడిపోయారు. వాస్తవముగా 'ఏసు శిలువ మీద ఆ దినము చనిపోలేదు' అనుమాట వాస్తవము. ఇది క్రైస్థవ లోకమునకు తెలియని రహస్యము. తన విషయములో పొరపడకుండునట్లు ఏసు ముందే చనిపోయిన వారిని చనిపోలేదని చెప్పి తిరిగి లేపినా, చివరకు మనుషులందరూ ఏసు చనిపోయాడని భ్రమ చెందారు. ఏసు ముందే మరణ విషయములో చూపిన సత్యమును, చెప్పిన మాటలను మనుషులు మరచిపోయారు.

**ప్రశ్న :- ఇంతలోతు విషయము ముస్లీమ్‌లకు తెలియదు కదా! వారు ఏసు చనిపోలేదని ఏ ఆధారముతో చెప్పుచున్నారు. మీరు చెప్పే విషయము ముస్లీమ్‌ల వాదనకు బలము చేకూర్చే విధముగాయున్నది. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** నేను చెప్పేది జ్ఞానము. నా వాదన సత్యమువైపు ఉండును గానీ, ఇతరులను ప్రోత్సహించునదిగా ఉండదు. వారిది సత్యమైతే నా మాట వారివైపు ఉండును. అయితే వారు సంపూర్ణముగా తెలిసి సత్యమును గురించి వాదించలేదు. కావున వారి వాదన వైపు నా మాటలుండవు.

ముస్లీమ్‌లందరూ స్థూల విషయములనే నమ్ముచుందురు. సూక్ష్మ విషయములను గురించి ఏమాత్రము ఆలోచించరు. వారి భాషలో చెప్పుకొను **"ముహ్కమాత్, ముతషాబిహాత్"** అను వాక్యములలో ముహ్కమాత్ వాక్యములను తప్ప ముతషాబిహాత్ వాక్యములను నమ్మరు. అనగా స్థూలమును తప్ప సూక్ష్మమును నమ్మరు. దేవుడు సూక్ష్మమైనవాడు, దేవుని జ్ఞానము సూక్ష్మమైనదే. అయితే అల్లాహ్ విషయములో సూక్ష్మ విషయములను నమ్మని దానివలన కనపడని ఏసు మరణమును గురించి వారు గ్రుడ్డిగా మాట్లాడడము తప్ప వారి వాదనలో సత్యము లేదని తెలియు చున్నది.

బైబిలులో వ్రాసిన వాక్యములను ఆధారము చేసుకొని వాటిని సరిగా అర్థము చేసుకోలేని స్థితిలో ముస్లీమ్‌లు మాట్లాడడము జరుగుచున్నది. శరీరములో నివశించు జీవుడు కంటికి కనిపించువాడు కాడు. ఏసు శిలువ మీద చనిపోయినది అందరూ చూచారు. తర్వాత చనిపోయిన దేహమును సమాధి కూడా చేశారు. అయితే అక్కడ ఏసు పొందిన మరణమును గురించి ఎవరికీ తెలియదు. ఏసు చనిపోయాడని కొందరు అనుకోగా, చనిపోలేదని కొందరు అనుచున్నారు.

**ప్రశ్న :- ఏసు శిలువ మీద చనిపోయాడా? లేదా? మీరు చెప్పండి?**

**జవాబు :-** చనిపోలేదు. ఆయన శిలువ మీద చనిపోయినట్లు కనిపించినది నిజమే. అయినా ఏసు అక్కడ చనిపోలేదు.

**ప్రశ్న :- అయితే ఏసు ఎప్పుడు చనిపోయాడు?**

**జవాబు :-** ఏసు 63 సంవత్సరముల వయస్సు జరుగుచున్నప్పుడు చనిపోయాడు.

**ప్రశ్న :- ఏసు శిలువ మీద 33 సంవత్సరములకే చనిపోయాడని అప్పుడు చూచిన ప్రత్యక్ష సాక్షులు చెప్పుట అసత్యమగునా?**

**జవాబు :-** వాస్తవము తెలియకుండా మాట్లాడితే వారు చెప్పినది ఒక విధముగా అసత్యమే యగును.

**ప్రశ్న :- వారు కంటితో చూచినది అసత్యమగునా?**

**జవాబు :-** కంటితో చూచినది సత్యమే అయినా, కంటికి కనిపించని సూక్ష్మభాగములు సత్యమనుటకు వీలులేదు. శరీరము కనిపించినా, శరీరములోని జీవుడు, ఆత్మ కనిపించరు కదా! **"జీవుడు శరీరమును వీడుటనుబట్టి చావు"** అంటాము. అట్లే **"శరీరములో చేరడమును పుట్టుక, పుట్టుక"** అంటాము. ఏసు శిలువ మీద ఎక్కించబడి ఆయన శరీరమునకు మలుకులు కొట్టడము జరిగినది సత్యమే. అయితే ఆయన శరీరమునుండి జీవుడు బయటికి పోయాడా? ఆత్మ బయటికి పోయిందా? అను విషయము క్రైస్తవులకు గానీ, ముస్లీమ్‌లకుగానీ తెలియదు. అంతిమ దైవగ్రంథములో ఏసును గురించి, ఏసు మరణమును గురించి వ్రాసిన కొన్ని వాక్యములను ఆధారము చేసుకొని, దానికి తోడు కొన్ని బైబిలు వాక్యములు కలుపుకొని ముస్లీమ్‌లు మాట్లాడుచున్నారు తప్ప, వారు కంటికి కనిపించని సూక్ష్మమైన జీవాత్మ, ఆత్మలను దృష్టిలో పెట్టుకొని మాట్లాడడము లేదు. వాస్తవానికి ఆయనకు అనగా **ఏసుకు 33 సంవత్సరములలో మరణమే రాలేదు. మరణము ఆయన వయస్సు 63 సంవత్సరములు గడచినప్పుడు వచ్చింది.** అయితే ఆ విషయము నేటి వరకు ఎవరికీ తెలియదు.

**ప్రశ్న :- ముస్లీమ్‌ల మాటను అటుంచి క్రైస్థవులు ప్రత్యక్ష సాక్షిగా చూచినదే చెప్పారు కదా! అది కూడా వాస్తవము కాదా!**

**జవాబు :-** క్రైస్థవులు చూచినది ఏసు యొక్క తాత్కాలిక మరణమును చూచారుగానీ మరణమును గురించి చూడలేదు. **ఏసు మరణము శిలువ మీద జరుగలేదు. గుజరాత్, రాజస్థాన్ రాష్ట్రములకు మధ్యన గల అడవిలో ఏసు చనిపోయాడను విషయము యావత్ ప్రపంచమునకే తెలియదు. అంతేకాక ఆయన 63 సంవత్సరములలో చనిపోయాడను విషయము కూడా తెలియదు.**

**ప్రశ్న :- "ఊరంతా ఉత్తరమంటే నాదొక్కనిది దక్షిణమన్నట్లు" ఏసు శిలువ మీద చనిపోలేదు. అప్పుడు ఆయన పొందినది తాత్కాలిక మరణము మాత్రమేయని, ఏసు 63 సంవత్సరములలో చనిపోయాడని ఎలా చెప్పుచున్నారు? మీరు చెప్పుమాటకు ఆధారమును చూపగలరా?**

**జవాబు :-** మొదటి మాటకు ఆధారముండదు, రెండవ మాటకు మొదటిది ఆధారమగును. ఇది సరిక్రొత్త విషయము. అందువలన వినేవాడు వినవచ్చును, వినని వారు వదలివేయవచ్చును. నేను చెప్పేది సత్యమని ఎవరినీ బలవంతము చేయము. నా మాట సరియైనదని అనుకొనుటకు అది మీ ఇష్టాయిష్టముల మీద ఆధారపడియుండును. మరణ విషయములో ఇంతవరకు మనకు తెలియని రహస్యములు చాలా గలవు. అందువలన ముందు 'మరణము' అంటే ఏమిటో తెలియవలసియుంటుంది. మరణ విషయమేకాదు పుట్టుక సమయములో, పుట్టుక ఎలా జరుగుచున్నదో కూడా తెలియని స్థితిలో మనమున్నాము. అందువలన ప్రసవింపబడిన బిడ్డలో అరగంటసేపు కదలికలు రాకపోతే ఆ బిడ్డ (ఆ శిశువు) కడుపులోనే చనిపోయిందను నిర్ణయానికి వచ్చి శిశువును భూమిలో పాతిపెట్టు చున్నాము. పుట్టుక విషయము తెలియని మనము తల్లిగర్భము నుండి బయటికి రావడమే పుట్టుక అని అనుకొంటున్నాము. అది కేవలము

శరీరమునకు మాత్రము పుట్టుకయనీ, జీవాత్మ పుట్టుక వేరని తెలియని మనుషులు ఎంతోమంది శిశువులను చేజేతులారా చంపుకొంటున్నాము. అట్లే చావు విషయము కూడా తెలియని మనము మనిషిలో చైతన్యము లేకుండా పోతూనే దానినే చావు అని అనుకొని పొరపడుచున్నాము. ఏసు ప్రభువు విషయములో అటువంటి పొరపాటునే పడినట్లు తెలియుచున్నది.

మరణములు మొత్తము నాలుగు రకములున్నవనీ, అందులో చివరిది అరుదుగా వచ్చునదనీ, ముఖ్యముగా మూడు మరణములను మనిషి కర్మప్రకారము పొందుచుండునని చాలామందికి తెలియదు. చాలామందికి అనుటకంటే అందరికీ తెలియదనియే చెప్పవచ్చును. మరణములలో ఒకటి అకాల మరణము, రెండు తాత్కాల మరణము, మూడు కాల మరణము అని ముఖ్యముగా మూడు మరణములు గలవు. నాలుగవదయిన 'చివరి మరణము' లేక 'మోక్ష మరణము' మనుషులకు అరుదుగా సంభవించు చుండును. మనిషి జీవితములో మనిషి కర్మనుబట్టి తాత్కాల మరణము, అకాల మరణము సంభవించవచ్చును లేక సంభవించకపోవచ్చును. పుట్టిన ప్రతి వ్యక్తికి కాలమరణము తప్పకయుండును. చావు పుట్టుకలు తప్పనిసరిగా ఉంటుండగా, అకాల మరణముగానీ, తాత్కాల మరణముగానీ మనుషుల కర్మలోయుంటే తప్పకవచ్చును. కర్మలేకపోతే రాకుండాయుండవచ్చును. అయితే చావుపుట్టుకలు రెండు కర్మ అనుభవములో లేకుండా యున్నవి. చావుపుట్టుకలను జీవుడు అనుభవించడుగానీ అవి రెండు జీవితమునకు మొదలు, చివరలాంటివి.

ఏసు జీవితములో 33 సంవత్సరములప్పుడు తాత్కాల మరణమును పొందాడు. తిరిగి మూడు రోజులకు సజీవముగా లేచినమాట అక్షర సత్యముగా యున్నది. ఏసు బ్రతికియున్నప్పుడే తన శిష్యులతో తిరుగు చున్నప్పుడే తన తాత్కాల మరణమును గురించి తన శిష్యులకు మూడు

మార్లు చెప్పియున్నాడు. ఏసు జీవిత విశేషముగల నాలుగు సువార్తలలో ఒక్క యోహాను సువార్తలో తప్ప మిగతా మూడు సువార్తలయిన మత్తయి, మార్కు, లూకా సువార్తలలో ప్రతి దానియందు ఏసు మూడుమార్లు తన మరణమును గురించి చెప్పినట్లు గలదు. అందులో **'మూడు రోజులు చనిపోయి తిరిగి లేస్తానని'** ముఖ్యముగా చెప్పబడియున్నది. అలా తిరిగి లేస్తానని చెప్పినప్పుడు అది తాత్కాలముగా చనిపోవడమేగానీ పూర్తిగా చనిపోవడము కాదని బైబిలు చదివిన వారు ఎవరూ గ్రహించలేకపోయారు. ఆ దినము ఆయన (ఏసు) మాటలను వినిన పన్నెండు మంది శిష్యులు కూడా ఆయన మాటలోని ఆంతర్యమును గ్రహించలేకపోయారు. బైబిలు గ్రంథములో ఏసు తన శిష్యులకు తన మరణమును గురించి ఏమి చెప్పాడో మత్తయి సువార్తలో వ్రాయబడిన దానిని ఒకమారు చూస్తాము **(మత్తయి 16-21) *"తాను యెరూషలేమునకు వెళ్ళి పెద్దల చేతను, ప్రధాన యాజకుల చేతను, శాస్త్రుల చేతను అనేక హింసలు పొంది, చంపబడి, మూడవ దినమున లేచుట అగత్యమని యేసు తన శిష్యులకు తెలియజేసెను."*** మత్తయి సువార్త 16వ అధ్యాయములో తన మరణమును గురించి మొదట తెలియజేసిన ఏసు 17వ అధ్యాయములో 22వ వాక్యమందు రెండవమారు తన మరణమును గురించి చెప్పాడు. **(17-22) *"వారు గలిలయలో తిరుగుచుండగా ఏసు మనుష్య కుమారుడు మనుషుల చేతికి అప్పగింపబడబోవుచున్నాడు. వారాయనను చంపుదురు. మూడవ దినమున ఆయన లేచునని వారితో చెప్పగా వారు బహుగా దుఃఖపడిరి."***

ఏసు తన మరణమును గురించి మూడవమారు మత్తయి 20–17వ వచనములో చెప్పడము జరిగినది. **(20-17) *"ఏసు యెరూషలేము***

**నకు వెళ్లనైయున్నప్పుడు ఆయన పండ్రెండుమంది శిష్యులను ఏకాంతముగా తీసుకొని పోయి, మార్గమందు వారితో ఇట్లనెను. "ఇదిగో యెరూషలేమునకు వెళ్ళుచున్నాము. అక్కడ మనుష్య కుమారుడు ప్రధాన యాజకులకును, శాస్త్రులకును అప్పగింప బడును. వారాయనకు మరణశిక్ష విధించి, ఆయనను అపహసించుటకును, కొరడాలతో కొట్టుటకును, శిలువ వేయుటకును అన్యజనులకు ఆయనను అప్పగింతురు. మూడవ దినమున ఆయన మరల లేచును."** ఈ విధముగా మిగతా రెండు సువార్తలలోనూ మూడుమార్లు తన మరణమును గురించి ఏసు తన శిష్యులకు ముందే తెలిపియున్నాడు. మూడు సువార్తలలోనూ తన మరణమును గురించి చెప్పడమేకాక తాను మూడవ దినము తిరిగి సజీవముగా లేచునని చెప్పియున్నాడు. ఆ మాటలతో ఆయన మరణము తాత్కాలమేయని తెలియుచున్నది. మూడు దినములు మరణములో యుండి తిరిగి లేచునని శిష్యులకు అందరికీ తెలిసిపోయినది. అయితే శిష్యులు ఆయన చెప్పిన మాటను మరచిపోయి ఏసు నిజముగా చనిపోయాడని భ్రమ చెంది ఏడ్వడము జరిగినది. అంతేకాక ఆయన (ఏసు) తిరిగి లేచి వచ్చిన తర్వాత కూడా ఆయనను సజీవముగా నమ్మలేకపోయారు. దయ్యముగా మారి వచ్చాడని కూడా అనుకోవడము జరిగినది.

ఏసు ముందే తన మరణమును గురించి చెప్పియుండకపోతే ఆయన తిరిగి బ్రతికి వచ్చాడని నేటికీ ఎవరూ నమ్మేవారు కాదేమో! ఏసు మూడు రోజులకు బ్రతికి వస్తానని మూడు సువార్తలలో చెప్పినట్లు మత్తయి, మార్కు, లూకా వ్రాసియుంచారు. అయితే ఆయన చెప్పిన మాటలలో శాస్త్రులకు, ప్రధాన యాజకులకు అప్పగింపబడినప్పటినుండి మూడు

దినములని ఎవరూ గుర్తించలేదు. తాను 'అప్పగింపబడిన సమయమునుండి' మూడు రోజులకు తిరిగి తమ ముందుకు వస్తానని శిష్యులకు చెప్పి యుండగా 'ఆయన చనిపోయిన తర్వాత మూడు రోజులకు' అని అక్కడివారు అర్థము చేసుకున్నారు. వారిలాగే నేడు క్రైస్థవ లోకమంతయూ అర్థము చేసుకొన్నది. అయితే నేడు మనుషులకు అర్థమయినట్లు ఏసు చనిపోలేదు. ఏసు చనిపోయి తిరిగి బ్రతికినప్పటికీ మూడు రోజులు ఆయన మరణములో లేడు. ఆయన మరణములో యున్నది కేవలము 33 గంటలు మాత్రమే.

మూడు దినములకు 72 గంటల కాలము పట్టును. అయితే ఏసు శుక్రవారము శిలువ వేయబడి సాయంకాలము చనిపోగా ఆయన ఒక్క శనివారము 24 గంటలు సమాధిలో ఉండడము జరిగినది. తర్వాత తెల్లవారుజామున రెండు గంటలకే సజీవమైన ఏసు మూడు గంటల సమయములో సమాధి బయటకు రావడము జరిగినది. దీనిప్రకారము శుక్రవారము దాదాపు సాయంకాలము నాలుగు గంటలకు తాత్కాల మరణమును పొందిన ఏసు ఆదివారము తెల్లవారుజామున రెండు గంటలకు సజీవమై వచ్చాడు. దీనినంతటినీ గమనించితే ఏసు సమాధిలో కేవలము 33 గంటల సమయము మాత్రమే యున్నట్లు తెలియుచున్నది. 33 గంటలు ప్రత్యక్షముగా సమాధిలో ఉన్నట్లు తెలియగా ఆయన ముందు చెప్పిన మాటలలో మూడు రోజులని ఉంది కదా!యని ఎవరయినా ప్రశ్నించ వచ్చును. ఆ ప్రశ్నకు నేడు ఎవరివద్దా సమాధానము లేదనియే చెప్పవచ్చును. అయితే ఏసు తన భక్తులతో **"నేను మీకు ఎవరూ ఎదురాడని జ్ఞానమును బోధిస్తానని"** చెప్పియున్నాడు.

**ఏసు చెప్పిన ఏ మాట పొల్లుపోనిదై జరిగితీరును.** అటువంటప్పుడు ఆయన ఎదురాడని జ్ఞానము అందిస్తానని చెప్పాడు గనుక ఆయన జ్ఞానము వలన ప్రతీ ప్రశ్నకు జవాబు చెప్పు స్థోమత ఆయన జ్ఞానమనుసరించిన

వారికుండును. ఇప్పుడు ఆయన చెప్పిన మూడు రోజుల గురించిన ప్రశ్నకు ఈ విధముగా జవాబు తెలియుచున్నది. ఏసు తన మరణమును గురించి మూడుమార్లు తెలియజేసినప్పుడు **"యెరూషలేముకు పోవు చున్నాము అక్కడ నేను అప్పగించబడుదును"** అని చెప్పాడు. అప్పగించ బడినప్పటి నుండి తన శిష్యులతో సంబంధము తెగిపోవుచున్నది. తిరిగి మూడు రోజులకు సంబంధము ఏర్పడుచున్నది. అందువలన "మూడవ రోజున" అను మాటను శిష్యులనుండి దూరమైనప్పటి నుండి లెక్కించవలసి యున్నది. అలా లెక్కించితే గురువారము రాత్రి ఏసును బంధించి శిష్యులనుండి దూరముగా తీసుకపోగా శుక్రవారము, శనివారము పూర్తి గడువగా తెల్లవారితే ఆదివారమనగా! ఆ తెల్లవారుజామున దాదాపు మూడు గంటల ప్రాంతములో ఏసు తిరిగి సజీవముగా వచ్చాడు. దీని ప్రకారము ఏసు బంధింపబడినప్పటి నుండి తిరిగి వచ్చువరకు మూడవ దినము అగుచున్నది. రెండు రోజులు పూర్తి గడువగా మూడవ రోజు ఏసు లేవడము జరిగినది. జరిగిన దానిని బట్టి ఏసు మాట తప్పక నెరవేరినదని చెప్పవచ్చును.

**ప్రశ్న :- ఏసు తన శిష్యులకు తిరిగి మూడవ రోజు కనిపించాడు అంటే అందులో తప్పుబట్టుటకు ఏమీ లేదు. ఇందులో మాకు ఒక సంశయము కల్గుచున్నది. ఇంతమంది క్రైస్తవులుగానీ, ఇతర మతస్థులుగానీ గుర్తించలేని విషయమును మీరెలా గుర్తించగలిగారు? మాకు అర్థమయ్యేటట్లు సత్యమునే చెప్పవలెనని కోరుచున్నాము?**

**జవాబు :-** నీకు అర్థమయినా, అర్థము కాకున్నా నేను ఉన్న సత్యమునే తెలుపుదును. ఏసు తన జీవితములో అనేక సందర్భములయందు ***"నేను నా తండ్రి ఏకమైయున్నాము"*** అని చెప్పడము జరిగినది. అంతేగాక

**"నేను చెప్పు ప్రతి మాట నా తండ్రిదే గానీ నాది కాదు"** అని కూడా చెప్పాడు. అలాగే ఏసు తన తండ్రితో ఎలా ఏకమైయున్నాడో అలాగే నేను నా ఆత్మతో ఏకమైయున్నాను. అందువలన ఆత్మ చెప్పు ప్రతిమాటను మీరు వినగలుగుచున్నారు. ఏదీ నేను స్వయముగా మాట్లాడలేదు. ఆత్మ నాతో ఏమి చెప్పినదో, దానినే మీతో నేను చెప్పడము జరుగుచున్నది. ఏసు ఉన్న రోజు, ఆయన తాత్కాల మరణమును పొందిన సమయములో వారియందే నాలోని ఆత్మ ఉండుట చేత అక్కడ ఏమి జరిగినది ఆత్మే తెలియజేయుచున్నది. అంత తప్ప నేను స్వయముగా చెప్పినది ఏమీ లేదు.

**ప్రశ్న :- ఎవరికీ చెప్పని ఆత్మ, ఎవరితోనూ మాట్లాడని ఆత్మ, మీతోనే ఎందుకు మాట్లాడుచున్నది? మీకు మీ ఆత్మతో ప్రత్యేకమైన దోస్తి కలదా?**

**జవాబు :-** ప్రతి మనిషి శరీరములో ఆత్మంటు ఒకటున్నది. దానినే నీ పొరుగువాడని బైబిలు గ్రంథమందు చెప్పియున్నారు. పుట్టిన ప్రతి మనిషికీ అతడు ఏ మతస్థుడయినా గానీ వానికి **స్నేహితుడు అనబడు ఆత్మ, పొరుగు వాడు అను ఆత్మ, తండ్రియను ఆత్మ** జీవాత్మతో పాటు జోడుగా శరీరములో ఉన్నది. ఈ విషయమును భగవద్గీత మొదలుకొని ఖురాన్ వరకు మూడు దైవగ్రంథములలోనూ ఆ విషయము చెప్పబడియున్నది. ప్రతి శరీరము లోనూ ఎవరికీ తెలియకుండా ప్రతి మాటను ఆత్మే పలుకుచున్నది. అయితే మనిషిలోని అజ్ఞానము వలన మనిషి తనలోని ఆత్మను గుర్తించలేకపోయి అన్నీ తానే మాట్లాడునట్లు భ్రమించుచున్నాడు. తన భావమునుబట్టి నేనే మాట్లాడుచున్నానని అనుకొంటున్నాడు. కొద్దిగా తనలోని ఆత్మజ్ఞానమును గుర్తించగలిగితే ఉన్న సత్యము తెలియును. ఏసు తన జీవితములో తండ్రియైన ఆత్మను గురించి ఎన్నోమార్లు, ఎన్నో సందర్భములలో చెప్పాడు. ఏసును అనుసరిస్తున్నామను క్రైస్థవులు ఏసు చెప్పిన జ్ఞానమును చూడక ఆయన ప్రార్థనలోనే మునిగిపోయారు. ప్రార్థన కోరికల కొరకే చేయు

చున్నారు. ప్రార్థన చివరిలో ఎన్నో కోర్కెలను ఏసును కోరుచున్నారు. ఏసును కొందరు తండ్రియని సంబోధించగా, కొందరు తమ సోదరునిగా చెప్పుచున్నారు. ఏసే ఎహోవాయనీ, ఏసే పరమాత్మయనీ, ఏసే అల్లాహ్‌యనీ పూర్తి దైవ భావముతో చూడడము లేదు. ఏసు తన జీవితములో చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోగలిగితే మనుషులు జ్ఞానులుగా మారగలరు. అప్పుడు మేము చెప్పినది కూడా నిజమని మీకు అర్థముకాగలదు.

**ప్రశ్న :- ఏసు యొక్క జీవితమును కాకపోయినా ఆయన మరణమును గురించి అంతిమ దైవగ్రంథమయిన ఖురాన్ గ్రంథములో కొంత చెప్పడము జరిగినది. ఖురాన్ గ్రంథములో చెప్పారంటే అది మహాజ్ఞాని అయిన జిబ్రయేల్ చెప్పిన విషయమై ఉండును. జిబ్రయేల్ కూడా అన్నీ సత్యమునే చెప్పియుండును. అయితే బైబిలులో ఏసు మరణ విషయము ఒక విధముగా వ్రాసియుండగా, అదే ఖురాన్ గ్రంథములో మరొక విధముగా వ్రాసియున్నది. బైబిలులో ఏసును శిలువ మీద శిక్షించగా, ఆయన శిలువ మీద చని పోయాడనియుండగా, ఖురాన్ గ్రంథములో "ఏసును శిలువ ఎక్కించనూ లేదు, ఆయన శిలువ మీద చనిపోనూలేదని" వ్రాయబడియున్నది. ఈ విధముగా బైబిలులో ఉన్న దానినిబట్టి క్రైస్థవులు మాట్లాడుచుండగా, ముస్లీమ్‌లు తమ గ్రంథములో ఈ విషయముందని చెప్పకుండా బైబిలులోని వాక్యములతోనే క్రైస్థవులతో వాదించుచున్నారు. బైబిలు, ఖురాన్ రెండు దైవగ్రంథములే అయినందున, అవి రెండు ఉన్న సత్యమునే తెల్పునవై యుండును తప్ప మనుషుల మధ్య అనుమానములను రేకెత్తించవు. వాటిలో చెప్పిన వాక్యములు మనుషులు సరిగా అర్థము చేసుకోలేక పోవచ్చునుగానీ, వాటిలో చెప్పిన జ్ఞానము నూటికి నూరుపాళ్ళు సత్యముగనేయుండునని అనుకొంటున్నాము. వాటి వివరమును తెలుపమని కోరుచున్నాము చెప్పండి?**

**జవాబు :-** అంతిమ దైవగ్రంథములో కొన్ని విషయములు నిగూఢముగా చెప్పడము వలన దానికి ప్రత్యేకమైన శక్తి, జీవము (జ్యోతి) ఉన్నదని చెప్పవచ్చును. అందువలన భగవద్గీత, బైబిలు, ఖురాన్ మూడు దైవ గ్రంథముల శక్తి ఎవరికీ అర్థముకాదు. అర్థము అయినా, కాకపోయినా ఈ మూడూ శక్తివంతమైన గ్రంథములు. అందులో ఏ సంశయమూ లేదు. ఏసు విషయము ఎదురుగా చెప్పినా, అర్థముకాని విధముగా యున్నదంటే, అందులో తనకు ఇష్టమైన వానికే అర్థమగులాగున, తనకు ఇష్టము లేనివానికి అర్థము కాకుండా ఉండులాగున ఆ గ్రంథము చేయుచున్నది. ఇప్పుడు ఆ గ్రంథమునకు ఇష్టమైనవారిగా కావాలంటే ముందు దేవునికి ఇష్టమైనవారిగా ఉండాలి. అప్పుడే నీవు గ్రంథమునకూ అందులోని జ్ఞానమునకూ ఇష్టమైన వానిగా మారగలవు. అప్పుడే అక్కడున్న జ్ఞానము అర్థము కాగలదు. బయట ఎంత పేరు ప్రఖ్యాతులున్నా, ఎంతోమందిలో గొప్ప జ్ఞాని అనిగానీ, బోధకుడు అనిగానీ, గురువు అనిగానీ అనిపించుకొన్నప్పటికీ గ్రంథమునకు నీవు ఒప్పుదల కాకపోతే అందులోనిది ఒక్క ముక్క కూడా అర్థముకాదు. ఇప్పుడు ఉదాహరణకు ఏసు మరణమును గురించి గ్రంథములో వ్రాసినది చూస్తే, అంతిమదైవ గ్రంథము ఎటువంటిదో మీకు కొద్దిగా అయినా అర్థము కాగలదు.

ఏసు విషయము బైబిలులోగలదు. తర్వాత ఇక్కడ ఖుర్ఆన్‌లో కూడా గలదు. ముందువచ్చిన గ్రంథములను ఖుర్ఆన్ గ్రంథము ధృవీకరించు చున్నది. కావున అక్కడ విషయము ఇక్కడ కూడాయున్నది. అయినా అక్కడ అర్థముకానివారికి ఇక్కడ కూడా అర్థము కాదు. అక్కడ అర్థమయిన వారికి ఇక్కడ కూడా అర్థము కాగలదు. ఏసు విషయము ఇక్కడ ఖుర్ఆన్ గ్రంథములో సూరా4, ఆయత్ 157, 158లలో ఈ విధముగా చెప్పియున్నారు. దానిని ఇప్పుడు చూస్తాము. **(4-157) "మర్యమ్ కుమారుడైన దైవప్రవక్త ఈసాను మేము హతమార్చాము**

**అనడము వలన, వారు ఆయన శిక్షను చూచారు. నిజానికి వారు ఆయనను చంపనూలేదు, శిలువపైకి ఎక్కించనూలేదు. నిజము ఏమిటంటే వారికొరకు ఆయనను పోలిన వ్యక్తి రూపొందించ బడ్డాడు. ఈసా విషయములో విభేదించిన వారు ఆయన వ్యవహారములో సందేహమునకు గురి అయ్యారు. అంచనాలను అనుసరించడము తప్ప వారికి ఈ విషయమై ఖచ్చితముగా ఏమీ తెలియదు. అసలు వారు ఆయనను చంపలేదు." (4-158) "పైగా దేవుడు తనవైపు ఆయనను ఎత్తుకొన్నాడు. దేవుడు సర్వాధిక్యుడు, మహావివేకి."** ఇంతేకాక మరొకచోట ఏసును, ఏసు విషయమును గురించి 4వ సూరాలోనే 171వ ఆయత్‌నందు ఇలా అంటున్నారు చూడండి. **(4-171) "మీరు ధర్మము విషయములో, అతిశయిల్లకండి, సత్యము తప్ప అల్లాహ్‌కు మరోమాట అయిన అసత్యమును ఆపాదించకండి. మర్యమ్ కుమారుడైన ఈసా కేవలము దైవప్రవక్త. అంతేకాక ఆయన సాధారణ ప్రవక్తకాదు, దేవుని ఆజ్ఞతో దైవ ఆదేశముద్వారా పుట్టించబడిన ఆత్మ. ఆ ఆత్మను మరియమ్‌వైపు మళ్ళించి ప్రయోగించాడు. ఇంకా ఆయన దేవుని దగ్గరనుండి వచ్చిన ఆత్మ మాత్రమే. కావున మీరు దేవున్ని, ఆయన పంపిన ప్రవక్తలను అందరినీ విశ్వసించండి. దేవుడు ముగ్గురు అనకండి. దేవుడు ఒక్కడే ముగ్గురు కాదు. (త్రిత్వము వాదనను మానండి) ఇందులోనే మీకు మేలుంది. ఆరాధ్యుడగు దేవుడు (అల్లాహ్) ఒక్కడు మాత్రమే. ఆయనకు కుమారుడున్నాడను విషయానికి దేవుడు అతీతుడు, పరిశుద్ధుడు. ఆకాశములోనూ, భూమిలోనూ**

**ఉన్నదంతా ఆయనకు చెందినదే. కార్యనిర్వాహకారిగా దేవుడు ఒక్కడే చాలు."**

ఇక్కడ మూడు ఆయత్‌లు చెప్పబడినవి. అందులో చివరిలో చెప్పిన 171వ ఆయత్‌ను ముందుగా గ్రహించగలిగితే పై రెండు వాక్యములు సులభముగా అర్థమగుటకు అవకాశము గలదు. ధర్మము అంటే ముందు కొద్దిగా తెలిసియుంటే దానిని గురించి తప్పుగాగానీ, అసత్యముగాగానీ చెప్పుకొనుటకు వీలుండదు. దేవుడు కార్యములను చేయడు. ఆయన చేయించు ఆజ్ఞ మాత్రమే అయివున్నాడు. అటువంటివాడు తన ఆజ్ఞచేత తన ఆత్మనే ఏసుగా పంపించాడు అనుటకు సాక్ష్యముగా, "ఏసు దేవుని దగ్గరనుంచి వచ్చిన ఆత్మ మాత్రమే" అని వాక్యములోగలదు. దీనినిబట్టి దేవుడు పంపిన ఈసా లేక ఏసు స్వయముగా దేవుడు పంపిన ఆయన ఆత్మయే అని తెలియగలదు. అందువలన ఆయన అందరి ప్రవక్తలలాంటి ప్రవక్తకాదు. దేవుని ఆజ్ఞతో వచ్చినవాడని తెలిసిపోయినది.

15వ సూరా 29వ ఆయత్‌లో చెప్పినట్లు **దేవుడు తన ఆత్మనే ఏసుగా పంపాడు.** అయితే ఆ విషయము మనుషులకు తెలియదు. ఏసు వచ్చి తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మ అని త్రిత్వమును చెప్పాడు. అయినా 'పరిశుద్ధాత్మయే దేవుడు' అని చెప్పాడు. అయితే ఆ మాట మనుషులకు అర్థము కాలేదు. ఆయన (ఏసు) బ్రతికిన 33 సంవత్సరములలో ఎవరికీ అర్థము కాలేదు. చివరిలో ఆయన ఒక శిక్షకు గురి అయ్యాడు. ఏసును శిలువ మీద వ్రేలాడదీయడమే ఆనాడు ఆయనకు పడిన శిక్ష. అయితే ఆయన వాస్తవముగా శిక్షార్హుడుకాడు. అటువంటి సమయములో జనుల దృష్ఠిలో ఆయన శిక్షార్హుడు. దేవుని దృష్ఠిలో శిక్షార్హుడు కాదు. ఈ రెండూ జరగాలి. జనుల అజ్ఞానము ప్రకారము ఆయనను శిలువను ఎక్కించి శిక్షను వేశారు. అప్పుడు ఏసు ఏసుగా లేడు. **ఏసును సైనికులు**

**పట్టుకున్నప్పుడు నుండి శిలువ వేయబడేంతవరకు ఒక పెద్ద మాయ జరిగింది.** దానిని తెలిసినవారే 'మాయ' అంటారు. తెలియనివారు జరిగినదే సత్యము అంటారు. ఇక్కడ వాక్యములో "ఏసును శిలువ ఎక్కించనూ లేదు. నిజానికి వారు ఆయనను చంపనూలేదు" అని అన్నారు. ఈ వాక్యమును చెప్పినది మహాజ్ఞాని అయిన జిబ్రయేల్. ఆయన చెప్పిన వాక్యము ఎప్పటికీ అసత్యముకాదు, పూర్తి సత్యమే. అందువలన 4-171 వాక్యములో మొదటనే **"మీరు ధర్మము విషయములో దేవుని మాటకు అసత్యమును ఆపాదించకండి"** అన్నారు. ఈ విషయము దేవుని ఆజ్ఞతో జిబ్రయేల్ చెప్పాడు. ఆ విషయముతో జిబ్రయేల్‌కు పనిలేదు, చెప్పవలసిన అవసరము లేదు. అయినా చెప్పాడు అంటే, ఖుర్ఆన్ జ్ఞానము ఏసు చెప్పిన జ్ఞానమును కూడా సమర్థించుచున్నది, ధృవీకరించుచున్నది. అందువలన ఏసు విషయమును తప్పక తెలియవలసియున్నది. అలా తెలియకపోతే ఆయనను అపోహలలో ముంచివేయడము కాకుండా, ఆయన జ్ఞానమును కూడా అపోహలలో ముంచివేయగలరు. అందువలన ఏసు మరణమును గురించి జిబ్రయేల్ తప్పనిసరిగా చెప్పవలసి వచ్చినది. ఇప్పుడు తప్పనిసరిగా మనము కూడా చెప్పుకోవలసి వచ్చినది.

ఇప్పటికే ఆ దినము ఏమి జరిగిందో తెలియక ఒకప్రక్క క్రైస్తవులు ఒక విధముగా చెప్పుచున్నారు. మరొక ప్రక్క ముస్లీమ్‌లు మరొక విధముగా చెప్పుచున్నారు. క్రైస్తవులు బైబిలులో వ్రాసిన విధముగా, ఆనాడు ప్రత్యక్ష సాక్షులు చూచిన దానిని, వ్రాసిన దానిని చెప్పుచున్నారు. అంతవరకు వారిది తప్పులేదు. అయితే అక్కడ వారికి తెలియనిది ఏసు చనిపోడను విషయము. వారు ఏసు శిలువ మీద చనిపోయాడు అనీ, తర్వాత మూడవ రోజు ఆదివారము ఉదయము బ్రతికివచ్చాడనీ చెప్పుచున్నారు. **ఇక్కడ ఏసు చనిపోయాడు అనడము క్రైస్తవులది తప్పు. అంతవరకు ఏసుకు**

**శిక్ష వేసినది, ఆయనను శిలువ ఎక్కించినది అన్నీ వారు చెప్పునది ఒక విధముగా వాస్తవమే. అయితే ముస్లీమ్‌లు తమ గ్రంథమందు ఇలా వ్రాశారు అనీ, ఏసు చనిపోలేదు అనీ అంటున్నారు. వారి గ్రంథములో జిబ్రయేల్ పై వాక్యములో చెప్పినట్లు నిజానికి వారు ఆయనను చంపలేదు అనుమాట వాస్తవమే.** అయితే **ఏసుకు శిక్షవేయలేదు, శిలువను ఎక్కించనూ లేదు అన్నమాట ఒక విధముగా పూర్తి తప్పు.** అయితే ఇప్పుడు మేము చెప్పినది కొంత అటు, కొంత ఇటుగా చెప్పి ఏదీ పొంతన లేకుండా చెప్పినట్లు కనిపిస్తున్నది కదా! అట్లే కనిపించునని మాకు తెలియును. అయినా అన్నీ తెలిసి ఈ మాట మేము చెప్పాము. ఇటు క్రైస్తవులు చెప్పు దానిలో కొంత సత్యమున్నది. అటు ముస్లీమ్‌లు చెప్పుమాటలో కొంత సత్యమున్నది. అయినా వారిది ఏది సత్యమో, ఏది సత్యముకాదో వారికే సరిగా తెలియదు. ఆ కాలములో ఏమి జరిగినది, జరిగినది ఏది సత్యము, ఏది అసత్యము అని తెలియాలంటే ఇప్పుడు మనము అక్కడికిపోయి వివరించుకొందాము.

ఆ దినము గురువారము రాత్రి ఏసు అతని శిష్యులు పదకొండు మంది "గెత్సేము" అనే చోటికి ప్రార్థన చేయుటకు వచ్చి, ఆయన శిష్యులనందరినీ ఒకచోట కూర్చోబెట్టి, కొంత దూరముపోయి ఒకచోట ఒంటరిగా ప్రార్థన చేయుచుండెను. అయినా ఆయన శిష్యులు నిద్రపోవు చుండగా, రెండుమార్లు వారివద్దకు వచ్చి వారిని లేపి మేల్కొనమని చెప్పి మూడవమారు ఆయన ప్రార్థన చేయుటకు పోయాడు. అప్పటికే అర్ధరాత్రి అయియుండుట వలన ప్రార్థన చేయుచూ ఏసు కూడా నిద్రలోనికి పోయాడు. ఏసు నిద్రపోయిన విషయము ఈనాటికి ఎవరికీ, ఏ క్రైస్తవునికీ తెలియదు. ఎవరికీ తెలియనది నీకెలా తెలుసు? అను ప్రశ్న మీకు రావచ్చును. అక్కడేయున్న నాకు ఎందుకు తెలియదు అని నాలోయున్న వాడు అడిగితే

మీరేమి అంటారు? అందువలన వినండి, ప్రశ్నించకండి. ఇక్కడ మనకు కావలసినది సత్యము, విశ్వాసము. విశ్వాసముంచి వినండి సత్యము తెలియబడుతుంది. ఏసును యూదా ఆ రాత్రి పట్టించాడు. అప్పుడు ఏసు నిద్రలోనేయున్నా ఆయన శరీరము దేవుడు పంపిన ఆత్మ చేత మెలుకువగాయున్నది. అక్కడికి వచ్చిన సైనికులు ఏసును పట్టుకొన్నామను కొన్నారు గానీ, వారు ఏసు శరీరమును పట్టుకొన్నారు. ఏసు నిద్రలో లోపలయున్నాడు. బయట ధ్యాస ఏసుకు ఏమాత్రము లేదు. అప్పుడు ఏసు శరీరమును నడిపించువాడు ఆత్మయే. ఆత్మయే అందరినీ నడిపించు చున్నా, ఏసును కూడా అంతవరకు ఆత్మే నడిపించినా ఏసు మెలుకువలో యుండెడివాడు. అయితే అప్పుడు ఏసు జ్ఞాపకములో లేడు. కావున పైన ఏమి జరిగినది ఏసుకు ఏమాత్రము తెలియదు. అందరి శరీరములనూ ఆత్మే నడిపించుచున్నది. అయితే అందరికీ జ్ఞప్తియుండి మెలుకువలో యున్నారు, గావున బయట ఏమి జరుగుచున్నది శరీరములోని జీవునికి తెలుసు. అయితే ఇక్కడ ఏసు పూర్తి నిద్రలో యుండిపోయాడు. బయట జరుగు తతంగము ఆయనకు ఏమాత్రము తెలియదు. ఈ విషయమును తెలియని మనుషులు, సైనికులు ఏసును పట్టుకున్నామని అనుకొన్నారు. అయితే ఆయన శరీరమును మాత్రము పట్టుకున్నారు. అప్పటినుండి శిలువ వేయబడేవరకు పెద్దమాయ జరిగింది అని ముందే చెప్పాను కదా! అప్పటినుండి ఏసు మౌనముగా యుంటూ రెండు మూడు మాటలకంటే ఎక్కువ మాట్లాడలేదు. ఎక్కువ మౌనముగా యున్నవాడు, రెండు మూడు మాటలు మాట్లాడినవాడు ఏసు కాదని ఎవరికీ తెలియదు.

చివరికి ఏసు చేత శిలువను మోయించుకొనిపోయి అతనిని శిలువను ఎక్కించి శిక్షను వేశారు. అయితే శిలువను ఎక్కించినది శిక్ష

వేసినది ఏసుకే అని అందరూ అనుకొన్నారుగానీ, ఏసుకి ఆ శిక్ష వేయలేదు. ఆయన శరీరమునకు శిక్ష వేశారని గ్రహించలేకపోయారు. అందువలన ఖుర్ఆన్‌లోని 4-157 లోని వాక్యములో **"వారు ఆయనను చంపనూ లేదు, శిలువను ఎక్కించనూ లేదు"** అని వ్రాశారు. జిబ్రయేల్ చెప్పిన ఈ మాట నూటికి నూరుపాళ్ళూ వాస్తవమే. అయితే క్రైస్తవులు ప్రత్యక్షముగా చూచారు కావున శిలువను ఎక్కించినదీ, శిక్ష వేసినదీ వారిలెక్కలో సత్యమే. ఏసును శిలువమీద ఎక్కించిన తర్వాత కొంతసేపటికి ఏసు శరీరములోని ఆత్మ కదలక మెదలక నాటకీయముగా నిలిచిపోయినది. అప్పుడు అక్కడున్న వారంతా ఏసు చనిపోయాడనుకొన్నారు. శరీరములోని ఆత్మ తన ఆరు నాడీకేంద్రములను నిలిపివేసి ఏడవ కేంద్రములో ఉండిపోవుట వలన అంతవరకూ కదలుచున్న శరీరము కదలకుండా నిలిచిపోయినది. అప్పుడు శరీరములో జీవము యున్నదని ఎవరు తెలియగలరు? ఆ సమయములో అన్నీ నిలిచిపోయి, శ్వాస ఆడక రక్తప్రసరణము కూడా నిలిచిపోవడము వలన అందరూ శరీరము చనిపోయిందని అంటారు. ఆ విధముగానే క్రైస్తవులందరూ 'ఏసు శిలువమీద చనిపోయాడు' అని అనుకుంటున్నారు. వాస్తవానికి 'ఏసు శిలువ మీద చనిపోలేదు' అనుమాటయే వాస్తవమగును. మరణమును గురించి చాలామందికి తెలియునుగానీ, తాత్కాలిక మరణమును గురించి ఎవరికీ తెలియదు. ఏసు ఆ సమయములో తాత్కాలిక మరణమును పొందియున్నాడని ఎవరూ గ్రహించలేదు. అటువంటి మరణము ఒకటుందనిగానీ, అటువంటి మరణమును పొందినవారు కొంతసేపు లేక కొంతకాలము, లేక కొన్ని దినములు చనిపోయి తిరిగి ప్రాణముతో బ్రతుకుదురనీ ఎవరికీ తెలియదు. ఈ మా మాట వాస్తవమనుటకు ఉదాహరణగా ఒక జరిగిన విషయమును చూడండి.

## (జమ్ముకాశ్మీర్‌లోని అబ్దుల్ అజీజ్ కథ)

2009 డిశంబర్ 7వ తేదీన టివీ9 లో మధ్యాహ్నము 1-30 నిమిషములకు ఒక కథనము ప్రసారమైనది. అదేమనగా! అప్పటికి వారము రోజుల క్రితము అనగా 2009 నవంబరు, 30వ తేదీన జమ్ము కాశ్మీరులోని రాజౌరి అను గ్రామములో అబ్దుల్ అజీజ్ అను 60 సంవత్సరముల వృద్ధుడు చనిపోయాడు. అతను ముస్లీమ్ అయిన దానివలన ఇస్లామ్ సాంప్రదాయము ప్రకారము అతనిని భూమిలో పూడ్చిపెట్టడము జరిగింది. అతనిని పూడ్చిపెట్టిన మూడు రోజులకు అతను సాధారణముగా చనిపోలేదనీ, ఎవరో హత్య చేశారని ఆరోపణ పోలీసులకు చేరింది. వెంటనే పోలీసులు కేసు వ్రాసుకొని స్మశానానికి పోయి అబ్దుల్ అజీజ్ శవమును బంధువుల సమక్షములోనే వెలికి తీశారు. వెలికి తీసిన అబ్దుల్ అజీజ్ శరీరమును పోస్టుమార్టమ్ (శవపరీక్ష) కొరకు ప్రభుత్వ ఆసుపత్రికి పంపించారు. అందులోని డాక్టర్ శవపరీక్ష చేయను మొదలు పెట్టాడు. మొదట తల భాగమును పరీక్షించుటకు తలమీద చర్మమును తీయుటకు కత్తితో తలమీద కొట్టడము జరిగింది. తలమీద గాయమైంది. అప్పుడు అందరికీ ఆశ్చర్యమగునట్లు అంతవరకు చనిపోయిన అబ్దుల్‌అజీజ్ లేచి కూర్చొని 'నన్నేమి చేయుచున్నారని' ప్రశ్నించాడు. అలా అతను లేచి అడుగడము డాక్టర్‌కు నమ్మశక్యము కాలేదు. అయినా డాక్టరు తేరుకొని అతను అడిగిన ప్రశ్నకు నిన్ను శవపరీక్ష చేయుచున్నామని చెప్పాడు. దానికి అబ్దుల్‌అజీజ్ 'నేను బ్రతికే ఉన్నానుకదా!' అని అన్నాడు. అంతలో డాక్టర్‌గారు అబ్దుల్‌అజీజ్ యొక్క బంధువులకు విషయమును తెలుపగా, బయటనున్న బంధువులు వచ్చి ఆయనను తీసుకుపోవడము జరిగినది. మూడు రోజుల క్రిందట అబ్దుల్‌అజీజ్ చనిపోయినపుడు పదిహేను నిమిషముల తర్వాత పరీక్షించి చూచి అతను చనిపోయాడని చెప్పాననీ అజీజ్ విషయములో అద్భుతము జరిగిందని డాక్టరు చెప్పడము జరిగింది. రాజౌరి గ్రామ

ప్రజలు కూడా తమ చేతులతో పూడ్చిపెట్టిన అబ్దుల్‌అజీజ్ మూడు రోజుల తర్వాత బ్రతికి రావడమేమని ఆశ్చర్యమును వ్యక్తము చేశారు. ఈ సంఘటన జరిగి ఇప్పటికి కేవలము ఆరు సంవత్సరముల ఏడు నెలలు మాత్రమే అవుతుంది. ఈ విషయమును అందరికీ తెలిసేలాగ ఆ రోజే టీవీ ఛానళ్ళు అన్నీ ప్రసారము చేశాయి. ఈ సంఘటన కూడ డాక్టర్ల సమక్షము లోనే జరిగింది. కావున ఎవరూ దీనిని ఖండించడానికిగానీ, మూఢ నమ్మకమనుటకుగానీ వీలులేదు.

## (విశాఖ జిల్లాలో జరిగిన ఒక సంఘటన)

విశాఖజిల్లాలో అరకు లోయకు పోవు దారిలో శృంగవరపుకోట అను ఊరు కలదు. శృంగవరపుకోట మండలమునందు అక్కడికి 12 కిలోమీటర్ల దూరములో సారెపురము అను గ్రామము కలదు. సారెపురము గ్రామములో 67 సంవత్సరముల వయస్సున్న సముద్రమ్మ అను పేరుగల ఆడమనిషి ఉండేది. ఆమెకు దాదాపు పది సంవత్సరములనుండి హైబిపి. మరియు షుగర్‌వ్యాధి ఉండేవి. ఆమె శృంగవరపు కోటలోని సీనియర్ డాక్టరయిన ధర్మలింగాచారి వద్ద వైద్యము చేయించుకొనేది. ఎం.బి.బి. యస్ డాక్టరు ధర్మలింగాచారిగారు మంచి పేరుగాంచిన దాదాపు 60 సంవత్సరముల వయస్సుగల అనుభవజ్ఞుడు. ఇప్పటికి 6 సంవత్సరముల పూర్వము ఒకరోజు సాయంకాలము 6 గంటల సమయములో సముద్రమ్మను డాక్టరు ధర్మలింగాచారి వద్దకు తీసుకరావడము జరిగినది. అంతకుముందే ప్రభుత్వ ఆసుపత్రిలో చనిపోయిందని చెప్పిన తర్వాత అక్కడికి తీసుక వచ్చారు. అప్పుడు డాక్టరు గారు ఆమెను చూడగా ఆమె శరీరములో బి.పి గానీ, నాడిగానీ ఏమాత్రము లేదు. ఆమె శ్వాసగానీ, నాడి (పల్స్)గానీ ఏమాత్రము లేనందున ఆమెను చనిపోయినట్లు నిర్ధారించిన డాక్టరు “ఇంటికి

తీసుకెళ్ళండి, ఈమె చనిపోయింది, ఈమెకు వైద్యము అవసరము లేదు" అన్నాడు. అప్పుడు వారు 12 కిలోమీటర్ల దూరములోనున్న వారి గ్రామమునకు తీసుకెళ్ళారు. అప్పటికే రాత్రి అయినందున ఉదయమే ఆమెను పూడ్చాలనుకొన్నారు. తెల్లవారగానే వర్షము ప్రారంభమై రెండు రోజులు ఏమాత్రము వదలకుండా కురియుచుండుట వలన బయటికి పోయేదానికి అవకాశమే లేకుండా పోయింది. సముద్రమ్మ శవాన్ని అలాగే మూడురోజులు వరండాలోనే ఉంచారు. మూడు రోజుల తర్వాత నాల్గవ రోజు ఉదయము ఆమె లేచి కూర్చొని అందరినీ పిలిచిందట. అప్పుడు ఆమె బంధువులు ఆమె బ్రతికినట్లు గ్రహించి వెంటనే డాక్టరు ధర్మలింగాచారి గారికి ఫోన్ చేయడము జరిగింది. పదిహేను రోజులు గడచిన తర్వాత ఆమెను డాక్టరుగారి దగ్గరకు తీసుకరావడము జరిగింది. అప్పుడు డాక్టరు "నీవు చనిపోయి మూడురోజులు అట్లే ఉన్నావు కదా! అప్పుడు నీకు యమభటులుగానీ, యమలోకముగానీ ఏమైనా కనిపించారా?" అని అడిగాడు. దానికి ఆమె "నాకు ఏమీ కనిపించలేదు" అని చెప్పిందట. ఈ సంఘటన కూడా ఒక డాక్టరు సమక్షములో ఆరు సంవత్సరముల క్రిందట జరిగినది. అందువలన దీనిని కూడా ఎవరూ కాదనుటకుగానీ, మూఢనమ్మక మనుటకుగానీ వీలులేదు. **(మరో సంఘటన గూర్చి ప్రక్కపేజీలో చూడండి.)**

శుక్రవారము మధ్యాహ్నము మూడు గంటలు దాటిన తర్వాత శిలువ వేయబడిన ఏసును చనిపోయాడని నిర్ధారించుకొన్న తర్వాత ఏసు అనుచరులు సాయంకాలము ఏసు శరీరమును తీసుకొనిపోయి భూగర్భ సమాధిలో ఉంచారు. అలా తీసుకుపోయిన ఆయన శిష్యులు ఏసు శరీరమును శవముగానే భావించారు. అప్పటికది శవములాగేయుంటుంది. అయినా ప్రాణము లోపలయుంటుంది. పైన చెప్పిన ఉదాహరణలను చూస్తే తాత్కాలిక మరణము కొంత అర్థముకాక తప్పదు. ఏసు శరీరములో

# చితి నుంచి ప్రాణాలతో..!

చెన్నై, న్యూస్‌లైన్: అనారోగ్యంతో బాధపడుతున్న తమిళనాడు కరూర్ జిల్లా కృష్ణరాయపురానికి చెందిన 50 ఏళ్ళ ముత్తుస్వామి మంగళవారం మరణించాడని డాక్టర్లు తేల్చేశారు. మృత దేహాన్ని తీసుకెళ్ళి అంతిమ సంస్కారం చేసుకోవాలని సలహా కూడా ఇచ్చారు. వయసు పైబడ్డం, అనారోగ్యం పీడించడంతో ముత్తుస్వామి నిజంగానే చనిపోయి ఉంటాడని భావించిన బంధువులు చితికి ఏర్పాట్లు చేశారు. శ్మశానంలో బంధువులు గుమిగూడారు. ఇక తలకొరివి పెట్టడమే తరువాయి. చితిపై పడుకోబెట్టిన శవాన్ని అంతిమంగా చూసేందుకు వచ్చిన ముత్తుస్వామి చెల్లెలు పాపాత్తి, దుఃఖాన్ని ఆపుకోలేక పార్థివ దేహంపై పడి బిగ్గరగా రోదించింది. 'అన్నా నన్నొదిలి వెళ్ళిపోతావా?' అంటూ శోకాలు పెట్టింది. అంతే! చనిపోయాడనుకున్న ముత్తుస్వామిలో కదలిక!! కాళ్ళూ చేతులూ కదిలాయి. అంతేకాదు, ఇంతలో చిన్నపాటి 'మూలుగు' కూడా ధ్వనించింది. మరికొన్ని సెకన్లలోనే కాళ్ళూ, చేతుల్లో తేలిక పాటి కదలిక. కన్నీటి సంద్రంలో మునిగిపోయిన బంధువులు ఈపరిణామంతో ఒక్కసారిగా ఆశ్చర్యానందాలకు లోనై బిగ్గరగా

- చెల్లెలి రోదనతో 'కన్నుతెరిచిన' అన్న
- వైద్యుల నిర్లక్ష్యంపై సర్వత్రా చర్చ!

'ముత్తుస్వామి.. ముత్తుస్వామి' అంటూ ఒక్కపెట్టున అరిచారు. వీరి అరుపులకు నిద్ర నుంచి లేచినట్టుగా చితిపై నుంచి లేచాడు ముత్తుస్వామి. 'ఏమిటి? ఏమైంది?' అని బంధువులను ఎదురు ప్రశ్నించాడు. దీంతో అందరూ హర్షాతిరేకాల మధ్య ముత్తుస్వామిని కౌగిలించుకుని, తిరిగి ఆస్పత్రికి చేర్చారు. ముత్తుస్వామి ఏకైక కుమార్తెకు సోమవారమే వివాహం కావడం గమనార్హం.

**వైద్యుల నిర్లక్ష్యం:** అనారోగ్యంతో బాధపడుతూ పది రోజుల కిందట స్థానిక ఆస్పత్రిలో చేరిన ముత్తుస్వామిపై వైద్యులు నిర్లక్ష్యంగా వ్యవహరించారని బంధువులు విమర్శించారు. వైద్యులు చేసిన ఘన కార్యంపై దుమ్మెత్తి పోశారు. కాగా, ఈ వార్త కరూర్ జిల్లాలో దావానలంలా వ్యాపించింది. దీంతో సర్వత్రా దీనిపైనే చర్చసాగింది.

గురువారము రాత్రినుండి నిద్రలోయున్నవాడు శుక్రవారము సాయంకాలము సమాధిలో ఉంచగా తాత్కాలిక మరణములో సమాధియందు 33 గంటల కాలమున్న తర్వాత ఆయన తాత్కాలిక మరణమునుండి జ్ఞాపకము వచ్చి అనగా మెలుకువలోనికి ఆత్మ తీసుకురాగా, ఏసు జ్ఞప్తిలోనికి వచ్చి లేచి రావడము జరిగినది. అప్పటికి అది క్రైస్తవులందరికీ వింతగానే కనిపించినా దేవుడు నిర్ణయించిన మూడు రకముల మరణములలో అది తాత్కాలిక మరణమని ఎవరికీ తెలియదు. అప్పటి క్రైస్తవులు ప్రత్యక్షముగా చూచిన విషయమునే చెప్పారు, కావున ఏసుకు శిలువ మీద శిక్ష వేశారు. ''ఆయన శిలువమీద చనిపోయాడు" అనుట ఒక విధముగా ప్రత్యక్ష సత్యమే అయినా, "ఆయన శిక్షకు గురికాలేదు, ఆయన శిలువను ఎక్కలేదు. ఆయన శిలువ మీద చనిపోలేదు" అన్నదే పరోక్ష సత్యము. ఆ దినము చూడకున్నా తన జ్ఞానముతో సూక్ష్మముగా జరిగిన విషయము సత్యమని జిబ్రయేల్ చెప్పాడు. జిబ్రయేల్ చెప్పినది పరోక్షముగా నూటికి నూరుపాళ్ళు సత్యమే. అయితే ప్రత్యక్షముగా ఆ రోజు చూచినది ఏసును శిలువమీదికి ఎక్కించారనీ, ఆయన చనిపోయాడనీ చెప్పుచుండుట సత్యమే. ఇక్కడ రెండు సత్యములు ఎలా జరుగునని ప్రశ్నిస్తే దానికి మా జవాబు ఈ విధముగా గలదు.

ఆ రోజు ప్రత్యక్షముగా చూచినవారు పైకి కనిపించు ఏసు శరీరమును చూచారు తప్ప, శరీరములో ఏసు ఉన్నాడా లేదా?యని చూడలేదు. ఏసు ఎంతసేపు నిద్రలోయున్నదీ, ఆయన ఎప్పుడు తాత్కాలిక మరణము లోనికి పోయినదీ పైకి కనిపించు విషయము కాదు, గనుక వారు ఏసును శిలువపై ఎక్కించువరకు యుండి తర్వాత శిక్ష అమలు జరిగిన తర్వాత చనిపోయాడని నమ్ముచున్నారు. క్రైస్తవులు చూచినది ప్రత్యక్ష యదార్థము. జిబ్రయేల్ చెప్పినది పరోక్ష యదార్థము. ఇరువురిదీ సత్యమే అయినా ఎవరిది ప్రత్యక్ష సత్యము, ఎవరిది పరోక్ష సత్యము అని తెలియబడక

పోవడము వలన క్రైస్తవులు చెప్పిన దానిని ముస్లీమ్‌లు అసత్యమంటున్నారు. అదే విధముగా ముస్లీమ్‌లు చెప్పిన దానిని క్రైస్తవులు అసత్యమంటున్నారు. ఇక్కడ మేము ఏమి చెప్పుచున్నామంటే ప్రత్యక్షముగా కనిపించినది శరీరమే కదా! అందులో ఎవరున్నది తెలియదు, కాబట్టి జిబ్రయేల్ జ్ఞానదృష్ఠితో చూచినదే సత్యము అంటున్నాము. క్రైస్తవులు ప్రపంచ దృష్ఠితో చూచారు కావున వారికి కనిపించినది ప్రత్యక్ష సత్యమే అయినా అది స్థూలదృష్ఠేగానీ, సూక్ష్మదృష్ఠి కాదు. అందువలన అంతిమ దైవగ్రంథములో పరోక్షముగా చెప్పినదే నిజమైన సత్యమనీ, క్రైస్తవులు ఆనాడు ప్రత్యక్షముగా చూచినది సత్యమే అయినా అది నిజమైన అసత్యమని తెలియవలెను. ఇప్పుడు మేము చెప్పినది గ్రహించుకొనువారికే అర్థమగును.

ఏసు చనిపోయిన తర్వాత ఆదివారము ఉదయము సజీవుడై బయటికి వచ్చాడు అని క్రైస్తవులు చెప్పుచుండగా, ఆయన చనిపోలేదు అని ముస్లీమ్‌లు అనుచున్నా వీరు వారు 4-158 వాక్యములో పొరపాటుపడి మాట్లాడుచున్నారు. ఆ వాక్యములో దేవుడు ఏసును తనవైపు పైకి ఎత్తుకొన్నాడు అని చెప్పుచున్నారు. వాక్యములో ఆ మాటయున్నా, అది వాస్తవమే అయినా కనిపించే వాక్యమువేరు, అర్థము చేసుకొను భావము వేరని తెలియవలెను. "ఏసును దేవుడు అలాగే పైకి తీసుకపోయాడు, ఏసును పోలిన వ్యక్తిని పట్టుకొని వచ్చి శిలువమీదికి ఎక్కించి చంపివేశారు" అని అంటున్నారు. "ఏసునే చంపారు" అని క్రైస్తవులు అనగా! ఏసులాంటి పోలికలున్న మనిషిని శిలువను ఎక్కించారనీ, అతనినే చంపారనీ దానితో ఏసు శిలువమీద మరణించాడని క్రైస్తవులు పొరపాటు పడినారనీ, వాస్తవముగా ఏసు వారికి దొరకలేదనీ, దేవుడు ఆయనను తనవైపుకు ఎత్తుకొన్నాడనీ ముస్లీమ్‌లు చెప్పుచున్నారు. అలా అనుకుంటే ముస్లీమ్‌లు

కూడా పూర్తిగా పొరపాటు పడినట్లేయగును. వీరికంటే క్రైస్తవులే కొంత మేలనిపిస్తుంది. వాస్తవానికి వీరికిగానీ వారికిగానీ ఏసు మరణమును గురించి సత్యము తెలియలేదని అర్థమగుచున్నది. జిబ్రయేల్ చెప్పినది కనపరాని సత్యము. క్రైస్తవులు చూచినది కనిపించే అసత్యము. క్రైస్తవులు చూచినది భౌతికముగా సత్యమే అయినా, అభౌతికముగా అసత్యము. అలాగే జిబ్రయేల్ చెప్పినది అభౌతికముగా సత్యము. అయితే ఈ రెండూ ముస్లీమ్‌లకు అర్థము కాలేదు. మొదటికే మోసము అన్నట్లు కనిపించే ఏసు శరీరమును శిలువమీదికి ఎక్కించినా, అది ఏసును పోలిన మనిషి అనడము పూర్తి తప్పు. దీనినిబట్టి జిబ్రయేల్ సత్యమును చెప్పినా, ముస్లీమ్‌లుగానీ, క్రైస్తవులు గానీ అర్థము చేసుకోలేదని చెప్పవచ్చును.

ఏసు సమాధినుండి 33 గంటల తర్వాత లేచివచ్చాడు అని చెప్పు కొన్నాము. క్రైస్తవులు కూడా అదే చెప్పుచున్నారు. అంతవరకు లేని ఏసు ఆదివారము ఉదయము తెల్లవారుజామున లేవడము జరిగినది. గురువారము రాత్రి రెండు గంటలకు నిద్రలోనికి పోయిన ఏసు మూడవ రోజు మూడు గంటల ప్రాంతములో లేచాడు. గురువారము రాత్రి నిద్రలోనికి పోయిన ఏసు శరీరములో ఎక్కడవుండి తిరిగి లేచాడు? అంతవరకూ జరిగినది తెలియదా? అను ప్రశ్నకు జవాబుగా ఇట్లు చెప్పుకోవచ్చును. గురువారము రాత్రి నిద్రలోనికి పోయిన ఏసు బ్రహ్మనాడిలో తన మనసు నిలిచిపోగా తానుమాత్రము గుణచక్రములోనే ఏమీ తెలియని స్థితిలో ఉండిపోయాడు. బయట సైనికులు తేవడము, న్యాయస్థానములో తీర్పు జరుగడము, తర్వాత శిలువ వేయడము వరకు ఆయన నిద్రలోనే ఉన్నాడు. అప్పటికి దాదాపు రాత్రి రెండుగంటలనుండి పగలు మూడు గంటల వరకు అనగా 12 లేక 13గంటలు నిద్రలోనే ఉండిపోయాడు. శిలువ వేసినంత

వరకుయున్న ఆత్మ లోపలికి అణిగిపోయి మరణించినట్లు నటించి బయటికి కనిపించునట్లు చేసినది. అప్పుడు ఆత్మ గుణచక్రము మధ్యభాగములోయున్న బ్రహ్మనాడిలోనికి చేరిపోయినది. అప్పుడు సప్త నాడీకేంద్రములలో ఆరు కేంద్రములు నిలిచిపోయి ఏడవ కేంద్రము అట్లే యుండును. దానినే 'మరణము' అంటాము. అలా ఆరు కేంద్రములు నిలిచి పోయినప్పుడు శరీరములో జరుగు ఏ కార్యమూ జరుగదు. అప్పుడు 'మరణము' అంటారు. మరణములో ఆత్మలోపలయుంటే అది తాత్కాలిక మరణమగును. తాత్కాలిక మరణములో జీవుడు గుణముల మధ్య ఉండకూడదు. అందువలన బ్రహ్మనాడిలోయున్న ఆత్మయే దేవునివలె జీవున్ని తనవైపు లాగుకొని బ్రహ్మనాడిలో చేర్చుకొనుచున్నది. శరీరములో ఏసుగా యున్న జీవున్ని దేవుని ఆత్మ అయిన ఆత్మయే తనవైపు లాగుకొని బ్రహ్మనాడిలో చేర్చు కొనుచున్నది. అప్పుడది అక్కడనుండి మరణముగా పరిగణింపబడును. అంతవరకూ నిద్రగాయున్నది, అప్పుడు మరణముగా లెక్కించబడుచున్నది. ఏసు అప్పుడు తాత్కాలిక మరణమును పొందాడని చెప్పవచ్చును. శరీరము లోపల జరిగినది జిబ్రయేల్ చెప్పగా దానిని అర్థము చేసుకోలేనివారు దేవుడే ఏసును పైకి ఆకాశముకు తనవైపు లాగుకొన్నాడని అనుకొంటున్నారు. దేవుడు శరీరములోనే యున్నాడు. శరీరములోనే ఆత్మ, జీవాత్మను దేవునివైపు లాగి మరణములోనికి చేర్చుచున్నది. అది తాత్కాలిక మరణములోనే అలా జరుగుచున్నది.

ఏసుకు జరిగినది అంతే! అదే విషయమునే జిబ్రయేల్ చెప్పాడు. జిబ్రయేల్ చెప్పినది ముస్లీమ్‌లకు అర్థము కాలేదు. క్రైస్తవులకూ అర్థము కాలేదు. జరిగిన సత్యమును బయటికి చెప్పువారు లేనందున ఇంతవరకు ఆ వివరము బయటికి రాలేదు. ఏసు తాత్కాలిక మరణములో 33

గంటలుండి తిరిగి మెలుకువలోనికి రావడము జరిగినది. అంతకుముందు పన్నెండు (12) గంటల కాలము నిద్రలో గడిపిన ఏసు నిద్రనుండి నేరుగా తాత్కాలిక మరణములోనికి పోయాడు. అక్కడనుండి బయటికి వచ్చు వరకు బయట ఏమి జరిగినది ఏసుకు తెలియదు. అందువలన బయట జరిగిన ఒక్క అనుభవమును కూడా ఏసు అనుభవించలేదు. ఏసు గురువారము రాత్రి లోపలికి పోయి ఆదివారము రాత్రి బయటికి వచ్చాడు. దానితో మూడు రోజులు లేకుండా పోయి వచ్చినట్లయినదిగానీ, ఆయన చనిపోయిన తర్వాత 33 గంటలు మాత్రమే సమాధిలోయున్నాడు. సమాధి నుండి బయటికి వచ్చిన తర్వాత 33 మార్లు తన శిష్యులకు కనిపించాడు. ఆ తర్వాత ఎవరికీ కనిపించలేదు. ఇదంతా చూస్తే ఖుర్ఆన్‌లో జిబ్రయేల్ చెప్పినది అసత్యముకాదు. బైబిలులో క్రైస్తవులు చదివినదీ అసత్యముకాదు. అయితే దేవుడు వాక్యములో చెప్పినా గ్రహించలేని స్థితిలో మనుషులు ఉన్నారు. అందువలన పూర్తి భావముతో అంతిమ దైవగ్రంథము ముస్లీమ్‌లకు అర్థము కాలేదు. అదే విధముగా క్రైస్తవులకు మధ్య దైవగ్రంథము అర్థము కాలేదు. ఇకపోతే ప్రథమ దైవగ్రంథము హిందువులకు అర్థము కాలేదని చెప్పవచ్చును. ఇప్పటికయినా అర్థము చేసుకోగలరని ఆశిస్తున్నాము.

**ప్రశ్న :- మీరు ఇంతవరకు చెప్పిన విషయములన్నియు క్రొత్తగా తెలియబడు రహస్యములుగా యున్నవి. ఈ విషయములన్నియూ వినిన తర్వాత మనుషులు ఏ విధముగా ఏసు మరణ విషయములో పొరపడినారో తెలియుచున్నది. మనుషులకు మరణముల వివరము తెలియని దానివలన ఎవరిష్టమొచ్చినట్లు వారు అనుకోవడము జరిగినది. మరణ రహస్యములు తెలిసిన తర్వాత ఏసు మరణములో యున్న చిక్కుముడి వీడిపోయినది. ఇటు బైబిలులో చెప్పిన వాక్యములు, అటు ఖురాన్‌లో చెప్పిన వాక్యములు**

**రెండూ సత్యమేయని నిరూపించబడినవి. మాకు ఇంతవరకు ఏసు మరణములో యున్న సంశయములన్నియూ తీరిపోయినవి. అయితే మీరు ఏసు ఎవరి చేతా చనిపోలేదు, ఆయన ప్రకృతి సిద్ధమైన చావునే పొందాడని చెప్పారు. మాకు ఏసు 33 సంవత్సరములు మాత్రమే బ్రతికినట్లు తెలిసినది గానీ తర్వాత ఎంతకాలము బ్రతికినది? ఎక్కడ బ్రతికినది తెలియదు. నాకే కాదు ప్రపంచములో ఎవరికీ ఆయన మూడవ జీవిత భాగమును గురించి తెలియదు. ప్రపంచములో ఎక్కువ శాతము మంది చేత ఆరాధింపబడు వ్యక్తియొక్క చివరి జీవితమును గురించి తెలియక పోవడము పెద్ద లోటుగాయున్నది. ఏసు సమాధినుండి బయటికి వచ్చిన తర్వాత దేవునిచేత పైకి ఎత్తుకోబడి ఆకాశములో కలిసిపోయాడని కొందరు చెప్పుచుండగా విన్నాము. ఆ మాట వాస్తవము కాదంటారా?**

**జవాబు :-** దేవుడు స్వయముగా మానవ అవతారములో భూమిమీద అవతరించినా ప్రకృతి సిద్ధముగా పుట్టవలెను. అలాగే ప్రకృతి సిద్ధముగా చనిపోవలసియుండును. అట్లుకాకుండా పైనుండి దిగిరావడము గానీ, పైకి లేచిపోవడముగానీ జరుగదు. అలా జరిగినదంటే అది సత్యదూరమైన మాటగా లెక్కించవచ్చును. ఏసు తాత్కాల మరణమును చెంది తిరిగి లేచిన తర్వాత దాదాపు 40 రోజులు తన శిష్యులకు కనిపించడము జరిగినది. 40 రోజులకుగానూ 33 మార్లు కనిపించినట్లు తెలియుచున్నది. 33 మార్లే కనిపించాడనుటకు ఆధారము లేకపోయినా, మాకు తెలిసిన విధానము ప్రకారము ఏసు 33 మార్లే కనిపించాడని తెలియుచున్నది. ఏసు అపరిచిత జీవితము 30 సంవత్సరములు కాగా, ఏసు ప్రజలకు సుపరిచిత జీవితము మూడు ఏళ్ళు సాగినది. తన రెండు విధానముల జీవిత సంఖ్య 30+3=33 అయినందున అది అందరికీ జ్ఞాపకముండులాగున సమాధినుండి లేచిన

తర్వాత 33 మార్లు మాత్రమే కనిపించాడు. అంతటితో తన అవసరము శిష్యులకు లేదని తెలిసిన ఏసు వారికి తర్వాత కనిపించకుండా పోయాడు. అలా అని ఆయన ఆకాశములోనికి పోలేదు. భూమిమీదనే రహస్య జీవనమును తిరిగి 30 సంవత్సరముల పాటు సాగించాడు. తన అజ్ఞాత జీవితము కొరకు ఆయన భూభాగము ద్వారా కాలినడకన ఇందూ దేశమని పిలువబడు భారతదేశమునకు రావడము జరిగినది. మొత్తము ఏసు యొక్క జీవిత కాలము 63 సంవత్సరములు.

**ప్రశ్న :- ఏసు భారతదేశమునే ఎందుకు ఎంచుకొన్నాడు?**

**జవాబు :-** ఏసు తన గత జన్మమును దాదాపు మూడు వేల సంవత్సరముల క్రితము భారత దేశములోనే గడిపాడు. అందువలన భారత దేశమునకు వచ్చాడని మనము అనుకోవచ్చును.

**ప్రశ్న :- ఏసు భారతదేశమునకు వచ్చినట్లుగానీ, వచ్చునప్పుడుగానీ ఎవరికీ తెలియదా? ఆయన శిష్యులకు తన అజ్ఞాత జీవితమును గురించిగానీ, తన భారత దేశపు ప్రయాణమును గురించిగానీ చెప్పియుండలేదా?**

**జవాబు :-** ఏసు భారత దేశమునకు వచ్చినది ఆ దినములలో ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ఏసు తన ప్రయాణమును గురించి సూచాయగా చెప్పాడు గానీ, శిష్యులు మాత్రము దానిని గురించి పూర్తిగా అడిగి తెలుసుకోలేకపోయారు. అయితే ఏసే తన ప్రయాణమును గురించి కొంత చెప్పియున్నారు. **(యోహాను 8వ అధ్యాయము 21) "నేను వెళ్ళి పోవుచున్నాను. మీరు నన్ను వెదకుదురు గానీ మీ పాపము లోనే యుండి చనిపోవుదురు. నేను వెళ్ళు చోటికి మీరు రాలేరని వారితో చెప్పెను."** నేను వెళ్ళు చోటికి అనగా "భారతదేశమునకు" అని

అర్థము. "నేను వెళ్ళి పోవుచున్నాను మీరు వెదకుదురు" అని కూడా చెప్పాడు. ఈ మాటలను ఏసు సమాధి పొందకముందే, తాత్కాల మరణమును పొందక ముందే చెప్పియున్నాడు. ఆ దినము ఆ మాటలను ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు.

**ప్రశ్న :- ఏసుకు కావలసినది భారతదేశములో ఏమున్నది?**

**జవాబు :-** ఏసు అజ్ఞాత జీవితమును భారతదేశములోని గుజరాత్ రాష్ట్రములోనే గడిపాడు. గతములో శ్రీకృష్ణుని జన్మలోయున్నది ఏసే అయినందున తిరిగి తన శేష జీవితమును గుజరాత్‌లోనే గడుపాలను కొన్నాడు. అంతేకాక కృష్ణుడు చనిపోయినది గుజరాత్‌కు రాజస్థాన్‌కు మధ్యలోగల అడవిలో అయినందున ఏసు మరణము కూడా అదే స్థలములో జరుగవలసియుండుట వలన ఏసు భారతదేశములోని గుజరాత్‌కు రావడము జరిగినది.

**ప్రశ్న :- మూడువేల సంవత్సరముల ముందు కృష్ణుని జీవితము గడచి పోయినది. కృష్ణుని జీవితమునకు, ఏసు జీవితమునకు మధ్యలో ఎంతో కాలము గడచిపోయినది. అటువంటప్పుడు ఏసు కృష్ణుని గురించి ఎందుకు ఆలోచించాడు?**

**జవాబు :-** ఏసు పుట్టుక, బాల్యము రెండు కృష్ణుని జీవితము గడచినట్లు అదే పోలికలతో ఏసు జీవితము గడచినది. మనిషి జీవితములో చావు పుట్టుకలే ముఖ్యమైనవిగా యున్నవి. పుట్టుకయంతా కృష్ణుని జీవితమువలె ఏసు జీవితము కూడా గడచినది. తర్వాత చావు కూడా అదే విధముగా గడువవలెనని ఉండుట వలన ఏసు భారతదేశమునకు వచ్చాడు. కృష్ణుడు ఎక్కడ చనిపోయాడో అదే అడవిలోనే ఏసు చనిపోవడము కూడా జరిగినది.

కృష్ణుడు చనిపోయినప్పుడు ఆయనవద్ద ఎవరూ లేనట్లు, ఏసు చనిపోయి నప్పుడు కూడా ఆయనవద్ద ఎవరూ లేకుండా పోయారు. కృష్ణుడు చనిపోయిన స్థలములోనే ఏసు ప్రాణములను వదలడము జరిగినది. దీనికంతటికీ కారణము ఒకటి గలదు. అదేమనగా! కృష్ణుని జన్మలో కృష్ణ శరీరములో ఏ శక్తి అయితే జీవునిగా నటించినదో, ఏ శక్తి అయితే భగవద్గీతను కృష్ణుని రూపములో బోధించినదో, అదే శక్తి ఏసు అనబడే శరీరములో కూడా చేరి మూడు సంవత్సరములు భగవద్గీతకు అనుసంధానమైన బోధను తెల్పినది. అయితే ప్రపంచములో ఇంతవరకు కృష్ణ శరీరములో వచ్చి పోయిన శక్తియే మూడు వేల సంవత్సరముల తర్వాత మరొక శరీరములో వచ్చి ఏసు అను పేరుతో చలామణి అయినదని ఎవరికీ తెలియదు. లోతుగా యోచించువారు తప్ప నేడు కూడా ఈ విషయమును ఎవరూ ఒప్పుకొను స్థితిలో లేరు. వచ్చిన ఆ శక్తియే తనను ఫలానావాడని గుర్తుపట్టనట్లు నటించిపోయినది. అయితే తన జ్ఞానము గలవారికి, తనను గురించి లోతుగా యోచించువారికి కొంతవరకు అర్థమగునట్లు రెండు జీవితముల లోను ఒకే పోలికగల సంఘటనలను మిగిల్చిపోయాడు. అవియే పుట్టుక, చావులోను మరియు శిశుదశలోను ఒకే విధమయిన జీవితమును గడిపాడు. అంతేకాక భగవద్గీతలో చెప్పిన జ్ఞానమునకు, నాలుగు సువార్తలలో గల జ్ఞానమునకు ఏమాత్రము తేడా లేకుండా చెప్పాడు. అయితే రెండు జ్ఞానములు ఒక్కటేయను విషయము తనను నమ్మినవారికి తప్ప మిగిలిన వారికి అర్థము కాకుండా చేశాడు.

ఏసు, కృష్ణుడు చెప్పిన జ్ఞానము ఒక్కటే అయినా ఒక్కటికానట్లు అందరికీ అర్థమగులాగున తన జ్ఞానమును చెప్పాడు. ఉదాహరణకు ఒకే జ్ఞానమయినా, వేరుగా ఎలా కనిపించునంటే, 'తూర్పునుండి ఎదురుగా పోతే పడమర వస్తుంది' అని భగవద్గీతలో చెప్పి, 'పడమరనుండి ఎదురుగా

పోతే తూర్పు వస్తుంది’ అని బైబిలులో చెప్పాడు. ఆలోచిస్తే రెండు ఒకే అర్థమును ఇచ్చు వాక్యములే అయినా రెండు వేరువేరు వాక్యములుగా కనిపించుట వలన హిందువులు, క్రైస్థవులు మాది వేరువేరు జ్ఞానమని అంటున్నారు. పైకి చూచుటకు రెండు వాక్యములు ఒకదానికొకటి విరుద్ధముగా కనిపించినా అందులోని భావము మాత్రము ఒక్కటేనని చాలామంది తెలియలేక వేరువేరు భావములు కల్గియున్నారు. మేము ఇక్కడ ఒకమాటను ఉదాహరణగా చెప్పాము. అదే కృష్ణుడు చెప్పిన వాక్యము, ఏసు చెప్పిన వాక్యము చూస్తే మేము ఉదహరించినట్లే యుండును. కృష్ణుడు భగవద్గీతలో చివరి అధ్యాయమైన మోక్ష సన్యాస యోగములో 17వ శ్లోకమున ఈ విధముగా చెప్పాడు చూడండి...

శ్లో॥ యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య నలిప్యతే।
హత్వాపి స ఇమాన్ లోకాన్ నహంతి ననిబధ్యతే ॥

**భావము :- “ఎవని భావములో అహంకారము లేదో, ఫలితము మీద ఎవనికి ఆసక్తి లేదో, వాడు ఈ లోకములోని వారిని చంపినా, అతడు హంతకుడు గాడు. హత్యాపాపము అతనిని అంటదు.”** ఈ వాక్యములో ఒక పనిని అహంకార రహితముగా చేసితే, ఆ పని వలన ఇతరులు బాధపడినా, చేసినవాడు ఆ పనిని చేసినట్లు లెక్కించబడదు. అంతేకాక అతడు చేసిన పనిలోని పాపము కూడా అతనిని అంటదు అని కలదు. దీనినిబట్టి ఒక పని జరిగినా జరగనట్లే లెక్కించబడుటకు ముఖ్యమైన కారణము అతనిలో అహము అనునది లేకుండా ఉండడమే కారణమని తెలియుచున్నది. అతడు ఒకని హత్య చేయుటకు ఎంతో కోపము కల్గియుండి హత్య చేసినా ‘నేను’ అను అహంభావము లేకుండుట వలన, అతను ఆ పని చేయనిదానితో సమానమైపోయింది. అందువలన “అతనికి పాపము అంటదు” అని భగవద్గీతలో కృష్ణుడు చెప్పడమైనది.

ఇదే విషయమునే అదే కృష్ణునిగాయున్న దైవశక్తే మరొక రూపమున, మరొక పేరుతో మూడు వేల సంవత్సరముల తర్వాత వచ్చి చెప్పినప్పుడు ఆ విషయమునే చెప్పినా కొంతమార్పుతో చెప్పుట వలన ఎవరూ గుర్తించ లేకపోయారు. పైగా చెప్పిన జ్ఞానమునకు బైబిలు అని పేరు పెట్టి, చెప్పిన వానిని ఏసు అని పిలిచారు. పేరు, మనిషి, గ్రంథము, మాట (వాక్యము) అన్నీ వేరుగా కనిపించుట వలన ఇది కృష్ణుడు చెప్పిన భగవద్గీతలోని వాక్యమని ఎవరూ గుర్తుపట్టలేకపోయారు. అయితే ఆయన (దేవుని) భక్తులు ఆయనను ఎప్పుడయినా గుర్తుపట్టగలరన్నట్లు ఆనాటి కృష్ణుడే తర్వాత వచ్చిన ఏసు అని మేము చెప్పుచున్నాము. అంతేగానీ కృష్ణుని వదలి ఏసు దగ్గరకు రమ్మనో, హిందువులు క్రైస్థవులుగా మారమనో చెప్పలేదు. మేము దైవికమైన జ్ఞానమును చెప్పితే అన్యమత ప్రచారము చేయుచున్నారని ఆరోపించు వారు కూడా కలరు. మేము మూడు మతములను ఏకము చేసి, అన్నీ సమానముగా చూచేవారమే తప్ప, ఏ మతమును మేము విమర్శించనూ లేదు, ఏ మతమును మేము సమర్థించనూ లేదు.

అన్ని మతములకు ఒక్కడే పెద్ద అయినప్పుడు ఏ మతము పెద్ద, ఏ మతము చిన్న అని చెప్పగలము. ప్రస్తుతము మేము కృష్ణున్ని ఏసును ఇద్దరినీ ఒక్కడేయని చెప్పినప్పుడు నాకు ఇద్దరూ సమానమే అగుదురు తప్ప ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ కాదు కదా! కృష్ణుడు, ఏసు ఇద్దరు ఒక్కరే అయినప్పుడు వారు చెప్పిన జ్ఞానము కూడా ఒక్కటేయని, దానినే గ్రహించమని చెప్పుచున్నాము. ఇప్పుడు బైబిలులోని ఒక వాక్యమును గమనిద్దాము. మత్తయి సువార్త 5వ అధ్యాయము 28వ వచనములో ఇలా ఉంది చూండి. **(మత్తయి 5-28) "ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పడే తన హృదయమందు ఆమెతో**

**వ్యభిచారము చేసినవాడగును."** భగవద్గీతలో కృష్ణుడు చెప్పిన మాటకు ఈ వచనము పూర్తి వ్యతిరేఖముగా యున్నట్లు కనిపించినా రెండూ ఒకే సారాంశమైన మాటలని యోచించువారికి బాగా అర్థమగును. అయితే క్రైస్థవ మతములో ఎందరో గొప్పగొప్ప బోధకులున్నా వారు మతము అను బంధములో చిక్కుకొని మా మతము వేరు, మా బోధ వేరు అని అంటున్నారు. మాకు కృష్ణునిలో ఏసులో ఒకేశక్తి, ఒకే జ్ఞానము కనిపించగా వారి దృష్టిలో కృష్ణుడు ఏసు ఇద్దరు వేరువేరు వ్యక్తులుగా కనిపించుచున్నారు. అట్లే వారి బోధలు వేరువేరుగా కనిపించుచున్నవి. క్రైస్థవులకు కృష్ణుడంటే ఏమాత్రము సరిపోదు. అలాగే హిందువులకు ఏసు అంటే పూర్తి అసూయ. రెండు మతముల వారికి కృష్ణుని యొక్క, ఏసు యొక్క స్థూల జీవితములే కనిపించుచున్నవి గానీ, వారి ఇరువురి అంతరంగములు కనిపించడము లేదు. వారి బయటి జీవితము ప్రకృతి సిద్ధమైనది, మాయతో కూడుకొని యున్నది. స్వరసాధారణముగా తమను ఎవరూ గుర్తుపట్టనట్లు వారి బయటి జీవితము అమరియుండును. అటువంటప్పుడు బయటి జీవితములో మాయ ప్రభావము తెలియునుగానీ, వారి అంతరంగములోని విధానముగానీ, జ్ఞానముగానీ ఏమాత్రము తెలియదు.

బాహ్య చూపు తప్ప అంతర్ జ్ఞానము తెలియని మనుషులకు మత్తయి సువార్త 5-28 వచనములో యున్న ఏసు మాటను, భగవద్గీత మోక్షసన్యాస యోగములో గల 17వ శ్లోకములోని భావమును ఒకటిగా పోల్చుకోలేకపోవుచున్నారు. అజ్ఞానులకు అంతుబట్టని విధముగా దేవుడు కూడా ఒకే వాక్యమునే, ఒకే భావముగల మాటనే రెండు విధములుగా, పరస్పర విరుద్ధముగా కనిపించునట్లు చెప్పియుండుట వలన యోచించని మనుషులకు, జ్ఞాన చూపులేని వారికి రెండు మాటలు ఒక్కటేయని తెలియక పోయాయి. 'తూర్పుకు ఎదురుగా యున్నది పడమర' అన్నప్పుడు దానికి

విరుద్ధ పదములు వాడి పడమరకు ఎదురుగాయున్నది తూర్పు అని చెప్పితే, చూచుటకు మొదటి వాక్యములోని పదములకు రెండవ వాక్యములోని పదములకు ఎంతో వ్యత్యాసము కనిపించుచున్నవి. అలా కనిపించినంత మాత్రమున రెండు ఒకే భావము కలవని బుద్ధితో యోచించువారు ఎవరయినా చెప్పవచ్చును. బుద్ధిలేని వారికి కృష్ణుడు చెప్పిన మరియు ఏసు చెప్పిన రెండు వాక్యములు వేరు భావముతో కనిపించుచున్నవి. జ్ఞాన దృష్టిలేని వారికి కృష్ణుడు, ఏసు వాక్యములు వేరువేరుగా కనిపించునట్లు, వ్యక్తులుగాయున్న ఏసు, కృష్ణుడు వేరువేరు వారిగా, వేరువేరు మతముల వారిగా కనిపించారు. అందువలన వారు ఏసును, కృష్ణున్ని మతముతో ముడిపెట్టి మాట్లాడుచున్నారు.

**ప్రశ్న :- ఏసు క్రైస్థవ మత ప్రవక్తయని అందరూ అంటున్నారు కదా! ఒక మత ప్రవక్త అయినప్పుడు అతడు ఆ మతమునకు సంబంధించిన వాడే కదా! అట్లే కృష్ణుడు కూడా హిందూ మతస్థుడే కదా?**

**జవాబు :-** ఏసు ఎక్కడయినా నేను చెప్పునది క్రైస్థవుల బోధయని చెప్పాడా? అలా ఎక్కడా చెప్పలేదు. ఆయన తన బోధలో 'సమస్త జనులారా!' అని సంబోధించి చెప్పాడుగానీ, ఓ క్రైస్థవులారా! అని సంబోధించలేదు. అటువంటప్పుడు ఏసు క్రైస్థవ మతస్థుడనీ, ఆ మత ప్రవక్తయని చెప్పడము అన్యాయమగును. అట్లే కృష్ణుడు తన భగవద్గీతలో సర్వ మానవులకు సంబంధించిన జ్ఞానమును చెప్పాడుగానీ నేను చెప్పునది హిందువులకే అన్నట్లు ఎక్కడయినా హిందువుల పేరు పెట్టి చెప్పాడా? అట్లు చెప్పనప్పుడు కృష్ణున్ని హిందువు అనడము కూడా అన్యాయమే అగును.

**ప్రశ్న :- సరే మీరు చెప్పినట్లే ఏసుయందును, కృష్ణునియందును ఒకే జ్ఞాన పోలికలు కనిపించుచున్నాయని కొంత యోచించగా మాకు కూడా**

**కొద్దిగా అర్థమయినది. పుట్టుకలో కృష్ణునితో సమానమైన పోలికలు పనులు జరిగాయి. బాల్యములో కూడా వారు ఇద్దరు రాజుల వలన మరణ గండమును ఎదుర్కొన్నారు. అయినా క్షేమముగా బయటపడ్డారు. కృష్ణుని పుట్టుక జరిగినట్లే ఏసు పుట్టుక కూడా జరిగినదని ప్రత్యక్ష సంఘటనల వలన తెలియుచున్నది. అయితే ఏసు జీవితము ఇంతవరకు 33 సంవత్సరములే గడచినదని అందరము అనుకోవడము జరిగినది. ఇప్పుడు మీరు ఒక్కరే ఏసు యొక్క తెలియని జీవితమును గురించి చెప్పుచున్నారు. కృష్ణుని మరణమునకు, ఏసు మరణమునకు కూడా కొంత అవినాభావ సంబంధము ఉన్నదని మీరే చెప్పుచున్నారు. వారి ఇద్దరి మరణములు ఏ సంబంధము కల్గియున్నాయో కొంత వివరముగా చెప్పవలెనని కోరు చున్నాము.**

**జవాబు :-** నేను ఒక రహస్యమును చెప్పుచున్నాను అంటే అది నేను చెప్పడము లేదు. దానిని చెప్పువాడు వేరుగాయున్నాడని ముందే చెప్పియున్నాను. ఎప్పుడో రెండువేల సంవత్సరములనాడు ఏసు చనిపోగా, 5000 సంవత్సరముల పూర్వము కృష్ణుడు చనిపోయాడు. ఇద్దరి మరణమునకు దాదాపు 3000 సంవత్సరముల మధ్య గడచిపోయినది. కృష్ణుడు చనిపోయిన 5000 సంవత్సరముల క్రితము ఏమి జరిగినదో ఇప్పుడున్న నాకు ఎలా తెలియగలదు? అలాగే రెండువేల సంవత్సరముల ప్పుడు ఏసు చనిపోయిన దినమున ఏమి జరిగినదో కూడా నాకు తెలియదు. అయితే ఆ రెండు సంఘటనలలో ప్రత్యక్షసాక్షి ఆత్మయుండుట వలన ఆత్మ చెప్పితే ఆనాటి సత్యము తెలియును. నేను ఆత్మను నమ్మిన వాడిని కావున నా ఆత్మను నేను వినయముగా అడిగితే ఆత్మ ఎంతటి రహస్యము

నయినా చెప్పగలదు. అట్లు నా ఆత్మ చెప్పిన రహస్యమునే చెప్పుచున్నాను తప్ప నేను స్వయముగా ఏదీ చెప్పలేదు.

అందరూ మాట్లాడుచున్నా అందరిలోనూ మాట్లాడునదే ఆత్మే అయివున్నది. ఎవరూ స్వయముగా మాట్లాడడము లేదని చాలామార్లు నేను చెప్పియున్నాను. **'ఆడించే ఆత్మ', 'నటించే ఆత్మయని'** పేరు పెట్టి చాలా ప్రసంగములు చెప్పియున్నాను. అదంతయు మూడు గ్రంథములలో ఆత్మ చెప్పిన విషయములేయని తెలియవలెను. మీకు ఆత్మ ఒకటి ప్రత్యేకముగాయున్నదని తెలియదు, అందువలన మీరు ఆత్మను ఏమి అడగక నేరుగా దేవున్ని అడుగుచున్నారు. దేవుడు ఉలకడు, పలకడు. అందువలన ఆయన ఏమి చెప్పడు, ఏమి ఇవ్వడు. చెప్పువాడు, ఇచ్చువాడు అన్నీ ఆత్మేయని నాకు తెలిసియుండుట వలన నేను ఆత్మనే ఆధ్యాత్మిక రహస్యములను అడిగి తెలుసుకొన్నాను. ఆత్మ ఆధ్యాత్మిక సంబంధ విషయములను తప్ప ఇతరములను ఎంత అడిగినా చెప్పదు, ఇవ్వదు. నాలోని నా ఆత్మ చెప్పిన విషయము ప్రకారము కృష్ణుని మరణమునకు, ఏసు మరణమునకు కూడా సంబంధముందని తెలియబడినది. కృష్ణుడు మొత్తము బ్రతికినది 126 సంవత్సరములు. ఆయన భగవద్గీత చెప్పినది దాదాపు 90 సంవత్సరములపైన యని చెప్పవచ్చును. ఖచ్చితముగా కొలత కొలిచి చెప్పితే 96 సంవత్సరములలో చెప్పాడు. తర్వాత 30 సంవత్సరములు ఆయన బయటి ప్రపంచమునకు పెద్దగా తెలియబడలేదు. అదే విధముగా ఏసు తనకు 33 సంవత్సరములు గడచిన తర్వాత తన శిష్యులకు కూడా 30 సంవత్సరములు కనిపించకుండా పోయాడు.

అలా కనిపించకుండా పోయిన తర్వాత 30 సంవత్సరములు క్రొత్త జాగా గుజరాత్‌లో, క్రొత్త దేశమయిన భారతదేశములో ఎవరికీ తెలియకుండా తన జీవితమును గడిపాడు. **కృష్ణుడు చనిపోయినది 126**

**సంవత్సరముల వయస్సులో, 126 అనబడు మూడు సంఖ్యలను ఏకము చేస్తే 1+2+6=9 అవుతుంది.** దేవుడు పెద్ద సంఖ్య అయిన 9గా గుర్తింప బడియున్నాడు. కృష్ణుడు మనిషిగాయుండి చనిపోయిన తర్వాత దేవునిగా మారిపోయి తిరిగి వెంటనే పుట్టలేదు. అందువలన ఆయన మొత్తము 9 సంఖ్యగా అయినప్పుడు 126 సంవత్సరములలో చనిపోవడము జరిగినది. అదే విధముగా **ఏసు చనిపోయినది కూడా 63 సంవత్సరముల వయస్సులోనే ఆయన జీవించిన 63 సంవత్సరములను ఒక్కటి చేస్తే 6+3=9 గానే వచ్చుచున్నది.** కృష్ణుని వలె ఏసు కూడా చనిపోయిన తర్వాత దేవుడుగా మారిపోయాడని చెప్పుటకు పెద్ద ఆధారముగా ఆయన 63 సంవత్సరములే జీవించగలిగాడు. ఈ విధముగా కృష్ణుని మరణము, ఏసు మరణము రెండూ సమతుల్యత కల్గియున్నాయని చెప్పవచ్చును.

ఇదంతయూ గమనించిన తర్వాత ఏసు ప్రకృతి సిద్ధముగా చనిపోయాడని చెప్పవచ్చునుగానీ, ఆయన ఇతరుల చేత చనిపోయాడని చెప్పుటకు వీలులేదు. ఏసు ప్రకృతి సిద్ధముగా 63 సంవత్సరములకు చనిపోగా అప్పుడే వచ్చిన వరదల వలన వాగులు పొంగి ఆయన చనిపోయిన చోటే భూసమాధి చేయబడ్డాడు. చివరకు ఆయన మృత దేహమును ప్రకృతియే అంత్యక్రియలు చేసినట్లయినది. కృష్ణుడు చనిపోయినప్పుడు కూడా ఆయన సంబంధులందరూ ఆయన శరీరమును భూమిలో ఖననము చేయగా అదే రోజే భారీ వర్షము వలన వరదలు వచ్చి కృష్ణుని సమాధి కొట్టుకొనిపోయి మరొకచోట భూసమాధి కాబడినది. అప్పుడు కూడా కృష్ణుని శరీరమును ప్రకృతియే తీసుకొనిపోయి భూమిలో పాతిపెట్టడము జరిగినది. ఈ విధముగా మరణము తర్వాత వారి ఇరువురి మృత దేహములను ప్రకృతి తన వశము చేసుకొని ఎవరికీ తెలియని జాగాలో వుంచి బురదరూపములో యున్న మొత్తని మట్టితో కప్పివేసినది. అలా

ప్రకృతి చేయడము వలన ఏసు సమాధిగానీ, కృష్ణుని సమాధిగానీ భూమి మీద ఆనవాళ్ళు లేకుండా పోయాయి. కృష్ణుని సమాధి, ఏసు సమాధి ఎక్కడ భూమిలోయున్నది ఎవరికీ తెలియదు. అది ప్రకృతికి మాత్రము తెలుసు.

ఒకే దేవుడు ధర్మములను జ్ఞానరూపములో బోధించుటకు వేరువేరు సమయములలో, వేరువేరు ఆకారములతో, వేరువేరు పేర్లతో భూమిమీదికి వచ్చి కొంతకాలము మనుషుల మధ్యలోయుండి తిరిగి దేవునిగానే మారిపోయాడు. వచ్చినవాడు ఎవడో ఖచ్చితముగా ప్రజలకు తెలియకుండా ప్రకృతే చేసినది. దైవజ్ఞానము లేనివారికి దేవుని ఆచూకీ ఏమాత్రము తెలియకుండా చేసినది. అంతేకాక ఆయన ఒక్కడేయని తెలియని మనుషులకు ఆయన సమాధి కూడా దక్కకుండా ప్రకృతే ఇద్దరిని సమాధిని చేసినది. ఇన్ని ఆధారములను నేడు ఆత్మే చూపుచున్నది. మీరు ఒక్కమారు బైబిలులో మత్తయి సువార్తయందు 10వ అధ్యాయమున 20వ వచనములో వ్రాసియున్న దానిని చూడండి. **(మత్తయి 10-20) " మీ తండ్రి ఆత్మ మీలో యుండి మాట్లాడుచున్నాడే గాని, మాటలాడువారు మీరు కాదు."** ఈ వాక్యమును చూచిన తర్వాత భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల 15వ శ్లోకమును చూడండి. **"నేను మీ హృదయ పీఠము మీద ఉన్నాను. నా వలననే మీకు స్మృతి, ఊహ, జ్ఞానము కల్గును"** అని యున్నది. ఈ వాక్యములను అనుసరించి నాలోని ఆత్మ ఇంతవరకు చెప్పిన విషయములను తెలియజేసిందని, నేను ఏమాత్రము కాదని తెలుపుచున్నాను.

**ప్రశ్న :- చివరిగా ఒక ప్రశ్న అడగదలచుకొన్నాను. గతములో ఏసు ప్రభువు మరణమును గురించి మీరు చెప్పినప్పుడు కృష్ణుడు చివరిలో**

**శరీరమునుండి రక్తము కారిపోయి చనిపోయినట్లు, ఏసు కూడా చివరిలో శరీరమునుండి రక్తము కారి చనిపోయాడని చెప్పియున్నారు. ఇప్పుడేమో ప్రకృతి సిద్ధముగా ఏసు చనిపోయాడని అంటున్నారు. ఈ విషయములో మాకు పూర్తి అర్థము కాలేదు. మీరు చెప్పినదంతా సత్యమే ఉంటుంది. అయితే సత్యమును గ్రహించుకోలేని స్థితిలో మేమున్నాము. దయచేసి కొంత మాకర్థమగునట్లు చెప్పవలెనని కోరుచున్నాము?**

**జవాబు :-** మీలోయున్న ఆసక్తి (శ్రద్ధ) ఎంతయున్నదో తెలియుటకు మేము కొంత సందిగ్ధములో పెట్టి చెప్పడమైనది. ఈ విషయము మీద మీకు శ్రద్ధయున్నది కావున నీవు అడిగావు. నీవు అడిగినందుకు నేను ఆ విషయమును సంపూర్ణముగా తెలియజేతును. ఏసును శిలువ మీద ఎక్కించినప్పుడు ఆయనతో సహా ఇద్దరు నేరస్థులను శిలువ వేయడము జరిగినది. ఈ విషయము లూకా సువార్త, 23వ అధ్యాయములో 39వ వాక్యమునుండి 43వ వాక్యము వరకు గలదు చూడండి. **(లూకా 23-39,40, 41,42, 43) వ్రేలాడవేయబడిన ఆ నేరస్థులలో ఒకడు ఆయనను దూషించుచూ "నీవు క్రీస్తువు కదా! నిన్ను నీవు రక్షించుకొనుము, మమ్ములను కూడా రక్షింపుమని" చెప్పెను. అయితే రెండవవాడు వానిని గద్దించి "నీవు అదే శిక్షావిధిలో ఉన్నావు గనుక దేవునికి భయపడవా? మనకైతే ఇది న్యాయమే మనము చేసిన వాటికి తగిన ఫలము పొందుచున్నాము గాని, ఈయన ఏ తప్పిదము చేయలేదని చెప్పి, ఆయనను చూచి ఏసు నీవు నీ రాజ్యములోనికి వచ్చునప్పుడు నన్ను జ్ఞాపకము చేసుకొనుమనెను. అందుకాయన వానితో నీవు నాతో కూడా పరదైసులో ఉందువని నిశ్చయముగా నీతో చెప్పు చున్నాననెను."**

ఈ విధముగా ఏసు తనతోపాటు శిలువ వేయబడిన వానికి అభయ మిచ్చియున్నాడు. ఏసును అడిగినవాడు పూర్తి అజ్ఞాని వానికి జ్ఞానము ఏమాత్రము తెలియదు. వాడు అడిగినది మోక్షమును కాదు. 'నీవు భూమిమీద రాజుగా వస్తే నన్ను జ్ఞాపకముంచుకొని నాకు ఏదయినా మంచి చేయమని కోరాడు'. ఏసు రాజ్యము పరలోకమని వానికి తెలియదు. వాని ఉద్దేశ్యమును బట్టి ఏసు అట్లే వాని కోర్కె ప్రకారము నీవు నాతో కూడా పరదైసులో ఉందువని చెప్పాడు. **పరదైసు అంటే పరదేశము** అని కూడా అర్థము వచ్చును. ఏసు వాని ఉద్దేశ్యమును అనుసరించి చెప్పిన మాటను నెరవేర్చుట కూడా ఒక కారణముకాగా, అన్నీ తెలిసిన ఏసు సమాధి నుండి బయటికి వచ్చి 40 రోజులు గడచిన తర్వాత తన అవసరము శిష్యులకు లేదని గ్రహించి, అక్కడనుండి బయలుదేరి భూమార్గమున కాలినడకతో దాదాపు ఐదు సంవత్సరములకు భారత దేశములోని గుజరాత్ స్టేట్‌కు రావడము జరిగినది. గుజరాత్ నుండి రాజస్థాన్ వైపుగల అడవిలో తన స్థావరమును ఏర్పరచుకొన్నాడు. ఆయన ఉన్న అడవి ప్రాంతములోనికి ఒక కిలోమీటరు విస్తీర్ణములో ఏ క్రూరమృగములు వచ్చేవి కావు. ఒక చదరపు కిలోమీటరు ప్రాంతము ఏసు రాజ్యముగా ఉండగా అక్కడ సాధుజంతువులే ఉండేవి. ఆయన ఆ ప్రాంతమునకు వచ్చుటకు ఐదు సంవత్సరముల కాలము పట్టినది. అక్కడికి వచ్చిన తర్వాత దాదాపు నాలుగు సంవత్సరముల వయస్సున్న చింపాంజి ప్రభువుకు అలవాటైపోయి ప్రభువు చెంత కాలము గడిపెడిది. ఆ చింపాంజి ఏసుతోపాటు దాదాపు 20 సంవత్సరముల కాలము గడిపినది. చింపాంజి కోతి ప్రతి దినము అడవిలోనికి పోయి చాలా రకముల పళ్ళను తెచ్చి ఏసుకు ఇచ్చేది. ఏసుకు తోడు చింపాంజికాగా, చింపాంజికి శ్రేయోభిలాషిగా ఏసు ఉండగా అక్కడే

20 సంవత్సరములు గడచిపోయినది. అప్పుడు చింపాంజి చనిపోవడము జరిగినది.

అడవిలో తోడయిన చింపాంజి కోతి మొత్తము 25 సంవత్సరములు బ్రతికినట్లయినది. ఏసు శిలువ మీద ప్రక్క నేరస్థునికి ఇచ్చిన మాట అంతటితో నెరవేరినది. అక్కడ అడిగిన నేరస్థుడు చింపాంజిగా జన్మించి ఏసు సాన్నిధ్యములో కాలమును గడిపాడు. ఏసు ఆ విధముగా ప్రక్క నేరస్థునికి ఇచ్చినమాటను నెరవేర్చాడు. చింపాంజి చనిపోయిన తర్వాత ఐదు సంవత్సరములు అడవిలో కాలము గడిపిన **ఏసు తర్వాత ఎంత కాలమునకు ఎక్కడ పుట్టాలి? ఎట్లు పుట్టాలి? ఎవరిగా పుట్టాలి?** అని ముందే నిర్ణయించుకోవడము జరిగినది. తర్వాత జన్మ భారతదేశములోనే జరగాలను నిర్ణయమును ఏర్పరచుకొని, రాబోవు **ఆదరణకర్తగా** ఎలా రావలెనో నిశ్చయించుకోవడము జరిగినది. ఏసుకు 63వ సంవత్సరము జరుగుచుండగా ఆయన సాధారణ జీవునిగా ఉండిపోయాడు. ఒక దినము సాయంకాలము గాలి వాన విపరీతముగా రావడము జరిగినది. అక్కడ ప్రక్కనేవున్న వృక్షము వ్రేళ్ళతో సహా పెకళించబడి ఆయన మీద పడి పొర్లిపోయినది. అలా వృక్షము విరిగి ఆయన కాళ్ళమీద పడి పొర్లి పోవడము వలన, ఆయన కాళ్ళకు గాయమై రక్తస్రావము జరుగుచుండగా ఆయన మూర్ఛ చెంది కొద్దిసేపటికి చనిపోవడము జరిగినది. అక్కడ జరిగినది ప్రకృతి భీభత్సము, ఆయన ఎవరి చేతను చంపబడక ప్రకృతి సిద్ధముగా వృక్షము వలన చనిపోవడము జరిగినది.

ఏసు చనిపోయిన తర్వాత ఆ ప్రాంతమంతయు వరదలు ఏర్పడ్డాయి. వరద ప్రవాహములో ఏసు మృత శరీరమును నీరు పైన మోసుకొంటూపోయి కృష్ణుడు సమాధి కాబడిన స్థలమునకు సమీపముగా ఒక వాగు ఒడ్డున భూసమాధి చేయడమైనది. ఆయన సమాధి ప్రకృతియే

స్వయముగా చేయగా, ఆయన మరణము ప్రకృతి సిద్ధముగా జరిగినది. ఆయన భారతదేశమునకు వచ్చి అడవిలో అంతకాలము ఉండుటకు ఏసుకు శిలువ వేయబడిన దినమున అడిగిన నేరస్థుని కోర్కె నెరవేర్చుటకే అని తెలియుచున్నది. అప్పటి కాలములో చిన్న నది లేక వాగులాంటి దానిలో నీరు ప్రవహిస్తుండేది. కృష్ణుని శరీరము గుజరాత్ వైపునుండి వచ్చి వాగుకు ప్రక్కనగల గట్టులో సమాధి కాబడినది. అడవివైపునుండి ఏసు శరీరము వచ్చి వాగుకు రెండవ వైపు గట్టు ప్రాంతములో పూడ్చిపెట్టబడినది. ఏసు చనిపోయి సమాధి కాబడి ఇప్పటికి రెండువేల సంవత్సరములుకాగా కాలక్రమములో వాగు రూపురేఖలు కూడా మారిపోయి రహస్యము తెలిసిన వారు కూడా వారిరువురి సమాధి స్థలములు గుర్తుపట్టని విధముగా మారిపోయినవి.

**ఒకానొక రోజు సముద్రము మీద ప్రకృతిని ఒక మాటతో శాసించిన వాడు, ప్రకృతి చేత మరణము పొంది, ప్రకృతి చేతనే అంత్యక్రియలు జరుపుకొన్నాడు. ఆయన ప్రపంచమునకే అధిపతి, సర్వాధికారి ఆయన ఎలా అనుకొంటే అలా జరుగుతుంది. ఆయన ఎప్పుడయినా భూమిమీద ఆదరణకర్తగా జన్మించి తాను ఇంకనూ చెప్పవలసిన జ్ఞాన విషయములను చెప్పిపోవును.** అయితే ఆయన ఈ మారు ఎప్పుడు వచ్చినా భారతదేశము లోనే వస్తాడను నిర్ణయము జరిగిపోయినది. అందువలన ఆయన బోధల కొరకు అందరము వేచి చూస్తాము.

ఇట్లు

**ప్రబోధానంద యోగీశ్వరులు**

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**

**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

